Sujanaranjani Series No. 5.



# తపతీసంవరణోపాఖ్యానము.



అద్దంకి గంగాధరకవి విరచితము.



కాకినాడ:

సుజనరంజనీ ముద్రాక్షరశాల,

1898



# పీఠిక.

## తపతీసంవరణోపాఖ్యానము.



ఈప్రబంధము నద్దంకి వీరనామాత్య పుత్రుండగు గంగాధర కవి రచియించె. అద్దంకివారి టచేఁ దన్నామ గ్రామ వాస్తవ్యులనియు, నమాత్యుండనుటచే నియోగి బ్రాహ్మణుండనియుం దోఁచుచున్నది. ఈకవి గోత్రసూత్రాదికములేమియు నిందువివరింపమింజేసి యవి పేర్కొనఁబడవు. ఇతండు గోలకొండ నవాబయిన యిబ్రహీమ్ మల్కు నొద్ద నాస్థానకవిగానుండి యతనికీ యంకితంబుగావించె. ఈయిబ్రహీము ఆ 1518 సం॥ మొదలు ఆ 1543 సం॥ పర్యంతము రాజ్యము చేసిన భామినీవంశీయ మహమ్మదీయ ప్రభువగు నిబ్రహీమ్ కుతుబ్ షాకుఁ దృతీయ పుత్రుఁడు. ఈయంశము నీక్రిందిపద్యము దృఢపఱచుచున్నది గీ॥ ఆకుతుబుషాహికుదయించిరనఘయశులు । మూఁడుమూర్తులవలె జగన్మోహనిధులు । ఘనవివేకులు హైదరుఖానవిభుఁడు । జంసతమహీంద్రుఁడిభరామచంద్రుఁడనఁగ॥ ఆ. 1 ప. 26 ఇబ్రహీమ్మునే యిభరామని యీకవి వాడినాఁడు. వసుచరిత్రమందును నిట్లనే యుపయోగింపఁబడియె. ఈయిభరాము ఆ 1550 సం॥ మొదలు ఆ 1581 సం॥ పర్యంతము రాజ్యముచేసినట్లు చారిత్రములఁ గానంబడుచున్నందున నీగంగాధర కవియు నీకాలమునందేయున్నవాఁడు. మహమ్మదీయ ప్రభువులకు మొట్టమొదట నాంధ్ర కవిత్వంబు రుచినిమప్పిన రసికుఁడీకవియే.

ఈతపతీసంవరణోపాఖ్యానము సంగారవర్ణుండర్జుననితోఁ జెప్పినట్లు భారతము నాదిపర్వము సప్తమాశ్వాసమునంగలదు అందు:—"వ॥ అంతనొక్కనాఁడు సంవరణుండు మృగయా వినోదార్థియై వనంబునం బరిభ్రమించి క్షుత్పిపాసాపీడితతురంగుండై యేకతంబ పాదచారియగుచుఁ జని యొక్క పర్వతప్రదేశంబున॥ క॥ కనియెనొకకన్యఁ గోమల । కనకప్రభ నిజశరీరకాంతిను పాంతం । బునవృక్షలతావళిఁ గాం । చనమయముగఁ జేయుచున్న చంద్రనిభాస్యన్॥" అని సంవరణుం డొక్కయరణ్యంబునకు వేఁటకుంజని తపతింజూచి భ్రాంతచిత్తుఁడైనట్లును, బిదప నామెయు నతనిం గని మోహించి నేను స్వతంత్రను గాను గాన నిన్ను స్వయముగఁ బెండ్లిచేసికొనందగదు, మజ్జనకుని సూర్యునారాధించిన నతండు నీకుం దప్పక నన్నొసంగునని యొడఁబఱచి చనినట్లును గానంబడుచున్నయది. ఆకథనీకవి ప్రబంధముగాఁజేయనెంచి నలచరిత్రకథను మనముననిడుకొనియందు హంస రాయభారమువలె నిందు శుక రాయభారముంచి మొదట నాయికానాయకులకన్యోన్య దర్శనంబు గలిగింపక కథను గొంతవ్యత్యాసపఱచి ప్రబంధవర్ణనములతోఁ బెంచి ప్రకృతగ్రంథరూపముగా రచియించె. ఇందుకీ క్రింది పద్యము సాక్ష్యమిచ్చుచున్నది. "క॥ కనుకలిమి వినుకలిమిలోపల । వినుకలిమియె మిగుల మదనవేదన చేయున్ । వినుకలిమివలవులఁ గాదా । నలువురగ మఱి మరులుకొనిరి నలదమయంతుల్॥ ఆ 3 ప. 41.

# 2

ఈ ప్రబంధమునందలి కథానాయకుండు సంవరణుం డదివ్యుండగు ధీరలలితుండు. నాయిక సూర్యతనయ యగు తపతి దివ్య. రసము, శాంతరసాంగముగల శృంగారము. కథ:—సంవరణుం డు ధరాధరుం డుపవనంబున నొకకొమ్మమ్మావి క్రీనీడఁ జంద్రకాంతశిలావేదిపైఁ గూర్చుండ నొక చిలుక యరుదెంచి సూర్య పుత్రియగు తపతీగుణసౌందర్యంబులు వర్ణించిన, నతని కామెయందనురాగముగలుగుట యెఱింగి నిన్నామె వరించునట్లుగావించెదనని చెప్పి తపతియొద్దకుం జని సంవరణునిగుణవిశేషంబులు వర్ణించి యామెకతనియందనురాగము వొడమునట్లొనరించె. రాజు తపతికొఱకై సూర్యునారాధించి యతనిచేఁ దపతిని నీకొసంగెదనను వాగ్దానంబు గొనియె. తపతి చెలికత్తెలతో భూలోకంబునకువచ్చి మరులుకొని యొక వనంబున మన్మథునారాధించుచుండ రాజు వేటకై యచ్చ కరుదెంచి శుకవాక్యంబుల నామెను నిరూపించి మోహవిభ్రాంతుఁడుగా నామె తన యస్వతంత్రతను నివేదించి తన తండ్రినారాధింపుమని యొడంబఱచి చనియె. రాజు నచట సూర్యునారాధించుచుండ గురువగు వసిష్ఠుండరుదెంచి యతని యభీష్టంబెఱింగి సూర్యుని కడకేగి తపతి త్రి యాతనికి వివాహంబొనరించె

గ్రంథమునందుఁ గథ చమత్కారముగఁ గల్పింపఁబడియె. అచ్చటచ్చట శాంతరసంబంగంబై కార్యసంఘటనంబుకావించి పోషింప రతిస్థాయి యంకురాద్యవస్థలం గ్రమంబుగనెనసి విభావానుభావవ్యభిచారి భావంబులంబలసి పానకరస న్యాయంబుం బొంది ఫలవంతంబగుటంజేసి శృంగారరసంబు పూర్ణంబుగ నున్నట్లు కానంబడియెడు. కావ్యమంతయు మధ్యమ వ్యంగ్య ప్రధానంబు. క్వాచిత్కంబుగ నుత్తమ వ్యంగ్యంబుంగలదనుటను వక్ష్యమాణంబుసూచించెడు. క॥ ఇలభరియిం పనృపాలుఁడు । తలయెత్తిననాఁడు మొదలు స్థైర్యముతోడం । దలలెత్తిరి ఫణివల్లభ । కులశైల దిగంతదంతికూర్మకిటీంద్రుల్॥ ఆ 1 ప 75. అధమ వ్యంగ్యంబగు చిత్రంబిందు మృగ్యంబు ఈకవి సాధారణార్థబోధకంబులగు సంస్కృతపదములనే యధికముగాఁబ్రయోగింపనభిలాషకలవాఁడు పద్యంబుల విశేష కల్పనా చమత్కృతియు, విశేషార్థ గాంభీర్యంబును, విశేషాలంకారంబులుంగానరాకున్నను నన్యోన్య మైత్రిం బొరసిన మృదుపదంబులతో గుణమణులు మెఱయఁ జదువుట కెంతయు లలితంబులై యుండు. మధుపాన ద్యూత యుద్ధంబులను కొన్నితక్క తక్కిన ప్రబంధ వర్ణనంబులన్నియుంగలవు. శాంతంబు వీరస్థానంబున నంగంబై యెనంగుటంజేసి తల్లోపంబులును నివృత్తంబులయ్యె.

ఈకవి శాస్త్రనిషిద్ధములగు క్త్వార్థకసంధులును, నకార ద్విత్వములును గలిగింపలేదు కాని కొన్నియెడల నికారసంధులనుమాత్రము గలిపె. కొన్నిచోట్లఁబ్రాక్కవి ప్రయోగంబులఁ గానంబడని యఖండయతులును, విరుద్ధములగు రేఫ ఱకారంబులకుఁ బ్రాసమైత్రియుఁ గావించె.

ఇకార సంధులు :—

1. చ॥ అరవిరిదమ్మిచందమున నాననవావన సోడుముట్టన
య్యరుణనుతానుతాధరసుధాఖ్యరసౌషధసేవ చేయఁగా
ధారికినఁగాక మిన్నకయుతొమ్మిదవన్నెలతోడి మన్మథ
జ్వరము శమించునే దివిజవైద్యుఁడు వైద్యముచేసెనేనియున్॥ ఆ 2 ప. 92.

2. సీ॥ పా॥ ఎదురొత్తుగుబ్బలనెదురొత్తి యాతనికిఁ గౌఁగిలేలకో మఱపనైతి॥ ఆ 3 ప. 51.

3. ఉ॥ అనఘుమోము నాతుకము నా యెదురొత్తు మెఱుంగుఁ జన్నుదో
యానిడు వాలుఁగన్నుఁగవ యానను జెక్కులు నాపెఱుందు సొం
పానిరు పేద నెన్నడుము నప్పటికిం దలపోసి చూచి నన్
మానసవృత్తి దానిమిషమాత్రనె నీరయిపోవకుండునే॥ ఆ 4 ప- 75.

4. గీ॥ అనుడు నృపవరేణ్యయానకలంబునీ । మనసులోని మమత మాకు దెలిసెఁ
నింతమాత్రమునకు నీతపంబేటికి । గోటనైన పనికి గొడ్డలేల॥ ఆ 5 ప 11.

అఖండయతులు :—

1, సీ॥ గీ॥ పద్మమును బోలి లక్ష్మికి సద్మమగుచు । నభినవంబైన సింహాసనంబునందు
రాజతిలకుండు మలికిభరామశౌరి। నిందుకొలువుండు నశ్వైశనేపుమిగిలి॥ ఆ1 వ 11

2. సీ॥ పా॥ కాంభోజరాజన్యకన్యకారత్నంబు తేరివీక్షించుచిత్రేశదేవ॥ ఆ 1 ప 12.

3. సీ॥ పా॥ ఆసరోజదళాక్షియతిసంసక్తి చేఁగలిగెనో నీకు లోకైకవశత॥ ఆ 2- ప 56.

3. రేఫ ఱకారములు :—

1. ఉ॥ సారవిభూతి రెండవవృషధ్వజుఁడాకృతిచేఁ దృతీయబ్రం
దారకవైద్యుఁడిద్ధశుచితాగుణమందుఁ జతుర్థపావకుం
డారయ భూమిమోచుటకు నైదవదిక్పతి దానరేఖచే
నాఱవకల్పవృక్షమన నన్నరపాలుఁడు మించెఁ గీర్తులన్॥ ఆ 1, ప 70-

2. చ॥ తరుణశుభాంగ రాజ్యమును దార్కొన యౌవనరాజు చేరఁగా
సరగున బాల్యరాజు వెడజారిన యప్పుడు మధ్యభూమినిం
గఱవు జనించెఁ జన్గవయుఁ గయ్యముకై మొనలేర్చె త్రీవ డాం
బరములరాజకంబయిన పట్టున నెట్టును బుట్టకుండునే॥ ఆ 2, ప 34.

3. క॥ ఎఱిఁగింపని బాలికఁ గని । యెఱిగించుకొనం దలంచు నింతులఁ గనియ
త్తెఱవల నెల్లను బొమ్మని । యొరిమెను సరిసన్న బోఁటి యొకతుకవలికెన్॥ ఆ 3, 61

ఆముక్తమాల్యద, మనుచరిత్రము, కవికర్ణరసాయనము, ప్రభావతీ ప్రద్యుమ్నము మొదలగు వానిలో నిత్యసంధులును, రేఫ ఱకారములకు మైత్రియుఁ గానంబడుటం జేసి యీకవియు నట్లే కావ్య చిత్కముగఁ బ్రయోగించియుండును-

కందుకూరి వీరేశలింగముగారు తమ కవులచరిత్రమున నీప్రబంధము వసుచరిత్రమును బోలి వఱలుచున్నది యని వ్రాసిరి. కాని, వసుచరిత్రమునం గల 1 కల్పనాచమత్కృతి, 2 పదగుంభన, 3 అర్థగాంభీర్యత, 4 వ్యంగ్యప్రాధాన్యత, 5 అలంకారశోభ, 6 రసనిరూపణము లోనగు వానిలో నొక్కటియైన నిందు సమగ్రముగ నున్నట్లు కానంబడదు. ఈప్రబంధమునందలి సీసపద్యములవంటి సీసపద్యములు కొన్ని వసుచరిత్రమునం గానంబడుటం జేసి యట్లనియందురని తోఁచెడిని. ప్రతికవియుం దనకంటెఁ బూర్వులు త్రొక్కిన త్రోవ త్రొక్కుట సామాన్యమే కదా? ఈగ్రం

గాథరకవియుం బెద్దనాదుల కల్పనలే యించుకమార్చి యనేకములు తనప్రబంధమునవ్రాసికొనియెం అట్టివి దిక్ప్రదర్శనముగ రెంటినిమాత్రమే చూపి యీయంశమును విరమించెద

మనుచరిత్రము :—

ఉ॥ ఎక్కడివాఁడొ యక్షతనయేందు జయంతవసంత కంతులం
జక్కఁదనంబునం గెలువఁజాలెడివీనిమహీసురాన్వయం
బెక్కడ నీతనూవిభవమెక్కడ ప్రోవనిబంటుగామరుం
డక్కఁగొనంగరాదె యకటా ననువీఁడు పరిగ్రహించినన్॥ ఆ ౨-

తపతీ సంవరణము :—

ఉ॥ చిక్కనిమోము మేల్మియగుచెక్కులు చొక్కపుహారవల్లిచే
నెక్కువపేరురంబు రమణీయవిశాల విలోచనంబులు
న్జక్కఁగమించురాసుతుఁడు నాదుకవుంగిటఁ గావురంబునం
జిక్కిన నేలనేమకర చిహ్నమువానివతారు పట్టుగన్॥ ఆ ౩- ప ౫౨

కవికర్ణరసాయనము :—

క॥ కుందనపుఁగమ్మవలపుం। జెందొడుచందమునఁదెల్లచెలువునఁబండై
సుందరియగునక్కన్నియ। యందెలప్రాయంబువిడువ నాయతమయ్యెన్॥ ఆ ౩, ప౯

తపతీసంవరణము :—

క॥ బంగరుసఁదావియమరిన। భంగిం జెలువునఁబండు పండినలీలన్
శృంగారవంతుఁడగున। య్యంగభవస్పర్థిమేన యౌవనమొదవెన్॥ ఆ ౩, ప ౨౯.

ది ౧౫ జూను ౧౮౯౫
కాకినాడ

P. V. N.

## విజ్ఞప్తి.

ఈతపతీసంవరణోపాఖ్యానపుఁబ్రతులుమాకు రెండుమాత్రమే దొరికినవి. ఆరెండైనను మాతృకాపుత్రికలుగాని భిన్నప్రతులుకావు. దానంజేసి స్ఖాలిత్యములచే సందిగ్ధములుగనున్న స్థలములు స్వతంత్రించిదిద్దఁజాలక ప్రకృతము విడిచిపెట్టితిమి కాఁబట్టి మంచిప్రతిగలవారొకసారి యాప్రతినిమాకుఁబంపినయెడల మేము దిద్దుకొని తప్పులుకొంచెముగనున్నపక్షమున వెంటనే వేఱొకశుద్ధప్రతివేసిగాని, తప్పులు విశేషముగానున్నచో రెండవపర్యాయము ముద్రించునప్పుడు వానినన్నిటిని జక్కగసంస్కరించిగాని ప్రతియిచ్చినవారిపేరుతోఁ గూడఁ బ్రచురించుటయేకాక వారిప్రతివారికే బంపునపుడు మంచియచ్చుప్రతుల నైదింటినిబహుమానముగాఁగూడనిచ్చుచున్నారము.



# తపతీ సంవరణోపాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.

ఉ. శ్రీసతిమించుగాఁ గఁదులసీదళమాలిక, కౌస్తుభోజ్జ్వలం
బై సురచాపలీలఁ జెలువందఁగ వేణురవంబు గర్జితం
బై సొబగొంద శౌరిఘనుఁడై కరుణారస వృష్టిఁ జేసి రా
యాసతఁ బ్రోచుగావుత నృపాగ్రణి మల్కిభరాము శౌండిపున్. 1

చ. వలపులపూఁత పూసి తలవంకను వెన్నెలపూవుఁ దాల్చి చెం
గలువ మెఱుంగురంగుగలకంబు ధరించి మిటారిజంగమై
వెలఁదిని జట్టుకూఁతుమది వెన్నవలెం గరఁగించు దేవుఁడీ
మ్మలికిభరాము శౌంగికి సమంచిత సంపదలిచ్చుఁగావుతన్. 2

చ. మినుకులపుట్టినిల్లుమిడిమేలపుఁదాపసుఁగన్నతండ్రి చ
కోరనినవిల్తుతోడునుడికారపుజోటిమిటారికాఁడు తి
న్నని వెలిదమ్మిపూపభువనంబులొనర్చువిధాత దాతయై
మనుచును గాత సంతతము మల్కిభరాముఁ జిరాయురున్నతిన్. 3

సీ. కలుగు లేలాయముల్ గాఁ బ్రవర్తించు సామ్రాణినధిష్ఠించు రౌతు తేఁడు
వీనులగాడ్పు చేమేని సొమ్ములతూక మగ్గలింపఁగఁ జేయునర్థి కాఁడు
శిరసుపై జాబిల్లి చెండుదండలరీతి మణిజాలములనించు మన్నెకాఁడు
తనుఁగొల్చు భక్తసంతతుల పాతకజాత మపహరించుకపోవునటమటీఁడు
పదియు నాల్వన్నె బంగరుఁ బ్రతిఘటించు । మేనిచాయలు గలమంచి మెచ్చులాఁడు
ద్విరదవదనుండు తనదంతవిధుమరీచి । మత్ప్రబంధాంతరాయతమంబు నడఁచు. 4

సీ. అలికుటుంబకదంబములకెల్లమృష్టాన్నశాలిక యే దేవి కేళిగృహము
తెరగంటిదొరలకెల్లరకుఁబండినపంటపొలమేవధూమణిపట్టినిల్లు
గుములరెండొకటిగాఁగుసుమబాణములేయుఘనుఁడేచకోరాక్షిగన్నకొడుకు
పాలలోఁబుట్టినపాంచితమానికము చేభామినిల్లునే భామభద్రపీఠ
మట్టిశ్రీదేవిదేవతాప్రార్థమాన । మానవేంద్రికశాలక్ష్యమానభాగ
భాగధేయప్రసూనేత్రపద్మసద్మ । కరుణనిభురామునకునిచ్చుఁగాతసిరులు. 5
గీ. మలికియిభరామువాకుఱ్ఱనవబవచెలువ
వెలయుఁగావుతయనివడి వేడనేల
యహహచతురాస్యుఁడుఁటయమ్మహామహుండు ।
తగదెవసియింపవాగ్దేవతా మతల్లి. 6
క. కేదారశ్రీగురువర । పాదాంభోజాతమునకుఁ బ్రణుతియొనర్తున్
మేదినిమామకమానస । కేదారములందుఁగోరికలుఫలియింపన్. 7
క. మున్నిటిసంస్కృతకవులను । విన్నాణపుఁదెగలుఁగుఁగవులవేడుకమీఱన్
సన్నుతులొనర్చియాంధ్రుని । కోన్నతసత్కవులకరుణనూర్జితమతినై. 8
క. దుండగపుఁగవులకొందఱు । పండితమానీంద్రులగుచుఁబలికిననేమం
చాండేమియనకవారికి । దండములొనగూర్చి రేనిధన్యులుసుకవుల్. 9
వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును గురు స్తోత్రంబును సత్కవిభూషణంబును దు
ష్కవి దూషణంబును నొనర్చి నవరసాలంకార భావాను బంధ బంధురంబుగా
నొకప్రబంధంబు నిర్మింప సమకట్టిననొకనాఁడు. 10
సీ. పద్మరాగోల్లసత్ప్రకటదీప్తులుశోణనవదళంబులచాయనవఘళింపఁ
బరభాగశోభావిభాసిభర్మప్రభల్ మధ్యకర్ణికచెల్వుమంచలింపఁ
గమనీయలావణ్యకాంతిపూరంబులుమకరందములతోడమత్సరింప
శాతమన్యవమణీశంఖచ్ఛవిచ్ఛటలిందిందిరశ్రేణిసీసడింపఁ
బద్మమునుబోలిలక్ష్మికిసద్మమగుచు । నభినవంబైనసింహాసనంబునందు
రాజతిలకుండుమలికిభూరాముశాలి । నిండుగొలువుండునవ్వేళసేఁవమిగిలి. 11
సీ. కాంభోజరాజన్యకన్యకారత్నంబు తేరివీక్షింపుచిత్తేశదేవ
కుంతలనీలాలికుంతలకొలుపునకరుదెంచెనిప్పుడేమరకుమయ్య

ఘూర్జరమదవతీకులతిలకంబ వెపత్రిణమిల్లఁదోడఁగొపరా కుసామి
కుకురుదేశాధీశముకురాస్యయే తెంచెదర్శనంబునకవధారుజియ్య
యనుచు హెగ్గడికత్తియలాడకాడ । కొక్కరొకరినె వేత్త్రేలనుగ్గడింప
నపుడువారలచేఁగొలువవధరించి । మరునివైఖరినిమ్మడిమలుకయమరె. 12
సీ. కాళాంచిఘరియించెఁగాళింగపుత్రికయడపంబుఁదాల్చెనంగానతాంగి
వీజనంబులువీచెభోజేంద్రనందనపసిఁడిపావలుపట్టెఁబాండ్యతనయ
కేరళేంద్రకుమారిగిండికేలధరించెఁగేకయతనుజచౌగియవహించెఁ
బావడఁగీలించెఁబాంచాలబాలికచోళకన్యకకరాచూలెఁదాల్చె
నాంధ్రభామినివీణియనాలపించె । గానమొనరించెఁగర్ణాటకమలగంధి
సాంద్రవిభవంబుతోడదేవేంద్రుఁడనఁగ । సరసుఁడైయున్నమలికేంద్రుసమ్ముఖమున.
సీ. సకలవేదపురాణశాస్త్రపారగులైనయొంటరివిద్వాంసులొకవంక
నష్టభాషలయందునాంధ్యంబులేకుండుహొంతకారికవీంద్రులొకవంక
గజపతినరపతిత్స్మోభర్తలంపినయొడెకంపురాయభార్లొకవంక
మేరుమందరములమించఁగల్గినమన్నెయుద్దండనాధులొక్కొక్కవంక
జేరికొల్వభద్రాసనాసీనుఁడగుచు । రమ్యగుణహారిమల్కిభురాముశౌరి
భారతక్షీరమయసింధుబంధుమధ్య । లలితపుణ్యకథాసుధాలహరిఁజేలి. 14
మ. ననురావించియనర్ఘ్యపీఠిఁబరమానందంబుతోనుంచిప
ద్మనవశ్రీభరపశ్యతోహరసుదృగ్ద్వంద్వంబునందేనెచా
యనుగారుణ్యరసంబుచిప్పిలఁగవర్షారంభశుంభద్ఘనా
ఘనగర్జార్భటిమీఱనిట్లనిమెరంగత్కీర్తిశృంగారుఁడై. 15
క. గంగాధరసుకవీంద్రియ । భంగురభవదీయవాక్యపదగుంభనముల్
గంగాధరమౌళినట । ద్గంగాతటినీతరంగగంభీరంబుల్. 16
క. తిన్నని పదముల నడవడిఁ । జెన్నొందుపలుకులను రసముచిప్పిలుచుండన్
సన్నపువార్తనటించెడి । యన్నువ సతివోలెఁగవితయమరఁగవలదే. 17
ఉ. పెక్కుకృతుల్ చమత్కృతులు పెంపుగనందితిఁగాని నీదుస
మ్యక్కృతి కన్యపైఁగల మమత్వము వర్తిలదందు లెక్కకుం
బెక్కువగాఁగ గోపికలు మించివసించిననేమి రాధపై

మక్కువయెక్కువై మిగుల మన్ననసేయఁడె శౌరివేడుకన్. 18

గీ. అట్లు గావున భారతాఖ్యానమందుఁ । గలుగు తాపత్య చరితంబు ఘనతమెఱసి
వివిధశృంగార మహిమల విస్తరించి । కబ్బమొనరింపు నాపేరఁగవివరేణ్య. 19

క. అనిక పురవుఁ దాంబూలము । కనకాంబర రత్నఖచితఘనభూషణముల్
పెనుపొందనొసఁగఁగైకొని । సునిశితమతిఁ గృతి యొనర్తు సొంపుగనాత్మన్. 20

క. కృతిభారతియిక్కథయా । కృతికినధీశుఁడు మలికియిభరాముఁడహా
క్షితినా భాగ్యము కలిమికి । జతలేదిక జాదులును బ్రసాదములయ్యెన్. 21

వ. అని వితర్కించి సవరస భావాను బంధురంబుగా నేరచియిఁపం బూనిన తప
తీ సంవరణ ప్రబంధంబునకు ముఖాలంకారంబైన కృతి పతి వంశావతారం
బెట్టిదనిన. 22

## కృతిపతివంశావతారము.

శా. ఢిల్లీపట్టణ పుణ్య భూమియని * * *

క. ఆపట్టణంబు తనకును । శ్రీపట్టగు రాజధానిఁ జేసి జయశ్రీ
రూపునిడు కుదుప నమలుక । క్ష్మాపాలకుఁడేలె సకల జగతీతలమున్. 23

సీ. పడమటను సవాయి బసువనిగాఁ జేసి యచటఁ గొయ్యలగొండ యూవరించె
దమరిమల్లాఖాను దండనంబునఁ గొట్టి హరియించె భానుగల్లాది గిరులు
ప్రథమ దిక్కులయొడ్డె పాత్రసామంతుల ధట్టించి కంభంబు మెట్టఁగొనియె
నుత్తరంబునఁ బరిస్తోడె పాఱఁగఁదోలి మెతుకుదుర్గం బాక్రమించి మించె
నతనిబొగడంగఁ దగదెయా చతురశీతి । రూఢిగిరిదుర్గ లుంతన ప్రౌఢతేజు
వాహాస్త్రుకరాధి రోహరేవంతమూర్తి । గుదుపషాహినిక్ష్మాపాలు గుణవిశాలు.

సీ. కటకేశ్వరునిదోలి కైవశంబుగఁ జేసెఁ గొండంత జయముతోఁ గొండపల్లిఁ
గంపమందించి తాఖానుండు గౌతమీ తటినిలంఘించి పోఁబటము వెట్టె
బైడవిరాహచప్రాంగణక్షోణిలో వీఁగఁదోలి బరీదు వెన్నుచూచె
సాగర గౌతమీ సంగమస్థలమున నడిదంబుగడిగెఁ బ్రఖ్యాతిగాఁగ
నష్టదిగ్రాజులను దనకరియఁగోరు । వెట్టికాపులఁ జేసి మువ్వెట్టిఁగొనియె
నితర ధరణీతలాధీశు లెవ్వరీడు । పృథివిఁగుదుపనమలుక చక్రేశ్వరునకు. 25

గీ. ఆకుదపశాహి కుదయించిరనఘయశులు మూడుమూర్తులవలె జగన్మోహనిధులు

ఘనవివేకులు హైదరుఖానవిభుఁడు। జంసతమహీంద్రుఁడిభరాముచంద్రుఁడనఁగ.

వ. అందగ్రజుండు. 27

శా. తీవిక్ హైదరుఖానుఁడుద్దవిడి యొడ్డేలంది ఖాళింపుచో
నావేళం బెదకొండపల్లి కఘుఁభుజ్యక్షోణి దీప్తారి ర
క్షౌవైయ్యార్తులు వాహినీపతి హరిశ్చంద్రుండు మార్కొన్నచో
జీవగ్రాహము గాఁగఁబట్టుకొనె నక్షీణ ప్రభావోన్నతిక్. 28

సీ. ధట్టించె నైజప్రతాప వైభవమున ఘనుఁడైన హైదరుఖానవిభుని
బట్టించెగిరివనీ పర్యంతభూములఁ దనకరిపెట్టని దండిరిపుల
మెట్టించెఁగంఖాణ ధట్టరింఖాకోటి దర్పితారాతుల తలలనెల్లఁ
గట్టించెను బరీదు గర్వభరంబింక భాసురంబుగను గైలాస కోటి
క్షితిని బ్రతిమెవ్వరింక వజీర్లలోన। శౌర్యగాంభీర్యధీరతౌదార్యమహిమ
ననఁగదిగ్దేశములఁగొనియాడ వెలసె। మదననిభుఁడైనజంసతమలభూవిభుఁడు. 29

సీ. అర్థిశేఖరులు ప్రత్యర్థిశేఖరులును ముక్తాతపత్రులై మూఁగికొలువఁ
దనదుకీర్తియును శాత్రవులకీర్తియు రెండుశరదభ్రవిస్ఫూర్తిఁజౌకళింప
నాత్మీయచిత్తంబునహితులచిత్తంబు ధీరహితక్రియఁదేజరిల్ల
నిజసపత్నులు శత్రునికరసపత్నులు స్వస్వలక్షణలీలనవధరింప
వెలసెఁ జౌరాశిగిరిదుర్గకులపరీత। సర్వసర్వంసహాభారధూర్వహుండు
వసుధపై నాధునికచక్రవర్తిగాక। రాజమాత్రుండె మలభరాముశౌరి. 30

సీ. మునుపు విశ్వామిత్రు ననుచరించుటఁజేసియిపుడువిశ్వహితానువృత్తిమెలఁగఁ
దొలుమేన ధర్మంబుద్రుంచి వేయుట నేఁడుధర్మసంస్థాపనత్వమునఁదనరఁ
గృతముధాత్రీసుతారతుఁడౌట నివ్వేళఁబరవధూటీ సహోదరతఁజెలువఁ
బుణ్యాజన ద్వేషమునఁ దొల్లి పరగుట పుణ్యజనావనస్ఫురణమెఱయఁ
దలఁచితనసద్గుణాలితోఁగలియుగమునఁ। దొంటిరఘురాముఁడౌదార్యధుర్యుఁడైన
వృత్తవర్తనతో భూమి వెలసెననఁగఁ। గువలయంబేలు నెమ్మదిఁగుదుపశాహి. 31

మ. సమరక్షోణుల మలభచంద్రుని జయశ్లాఘా యశోగంగయు
న్విమతాకీర్తికళిందకన్యయు వెలిస్సిండౌ సరస్వత్యభి
ఖ్య మహారక్తఝరచ్ఛలాత్మనెనయంగా నట్టెముచ్యేటి దం

డమునుం గల్ రిపుకోటికెల్ల గలిగెన్ రంభాపరీరంభముల్. 32

మ. స్మరసాధారణ రూపవంతుఁ డిభరామక్ష్మావరుం డుద్ధతిన్
దురగారోహణ మాచరింప నరిసందోహంబు నేత్రంబులం
దరుదాఁచీఁకటిఁ గ్రమ్ముటర్కనయన వ్యాపారముం గప్పఁద
త్ఖురకోటీపుటఘట్టితోద్ధత ధరాధూళీ ప్రపంచంబులన్. 33

సీ. సుమసారసత్కళా కరుణారసంబుల రామచంద్రులతోడ రాయడించి
పావనగుణధామ పావకత్వంబుల నగ్నిమిత్రులతోడ నవఘళించి
భూభృతి ప్రాభవ స్ఫురితవితీర్ణుల నాగార్జున ప్రౌఢి నలువమీఱి
చాపవిద్యాశౌర్య శాశ్వతలక్ష్ముల నరసింహుల పరిపాటిఁ బరిమళించి
నవనిధానంబు లాత్మీయనయనసంజ్ఞ । యాచకులయిండ్ల తాండవంబాడఁజేసె
రాజరాజును గైకోడె రాజులీడె । పృథివిపల్కిభరాముభూమీశ్వరుండు. 34

షష్ఠ్యంతములు.

క. హిందూరాయపిభాళున । కిందుకరోద్యమనసుగుణభృతశీలునకున్
మందేహదేహతాపన । సందేహమహాహృతారిజంబాలునకున్. 35

క. కుతుపనమలుకసుపుత్రున । కతులితచతురిమవితీర్ణహారమిత్రునకున్
బ్రతివారస్తుతసార । స్వతధీరప్రణుతవిజయచారిత్రునకున్. 36

క. కాళీవల్లభసమతా । శాలిమహైశ్వర్యధుర్యసౌభాగ్యునకున్
హాలాహలకోలాహల । లీలాహరణప్రతాపలీఘాభ్రిణకున్. 37

క. ధాటీవివిధాటీకన । ఘోటీఖురకోటిదళితకులకుధరోద్ధా
పాటలధూళీకుంకుమ । పాటీరవిభూష్యమాణబహుదిక్కునకున్. 38

క. ఇభరామస్వాధ్యాత్మున । కభిరామపరాక్రమైకహార్యాత్మునకున్
శుభసంపన్నిటలాత్మున । కభియాతివిఘాతనక్రియాదక్షునకున్. 39

కథాప్రారంభము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నేరచియింపంబూనిన తపతీసంవరణోపాఖ్యా
నంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 40

సీ. కౌంతేయులేకచక్రనివాసులై యుండి యజ్ఞసేనను తాస్వయంవరంబుఁ
గను వేడ్కఁ బాంచాలజనపాలు ప్రోలికి నక్తందివప్రయాణములనరుగ

నర్ధరాత్రంబున నంగారపర్ణుండు మధ్యమార్గంబున మార్గమలసె
నరుచేతనాగ్నేయ శరబాధ్యమానుఁడై తాపత్యకులదీప దయఁదలిర్చి
నన్ను మన్నింపుమనిన గంధర్వ విభుని। కభయమొసఁగిధనంజయుండనఘుతపతి
కులసముత్పత్తి తమకెట్టు గలిగెననఁగ । నాకథాకథనేచ్ఛనిట్లనియె నతఁడు. 41
క. ఓపాండవ వేయ మీకుల । భూపాలకజాతరత్నములకునుగటకం
బైపృథివీకరకటకం । బైపరగునుహస్తిపురమనంతశ్రీభూతిన్. 42
సీ. శ్రీభావిశేషమిశ్రీభావిభవనంబు సారస కలిత కాసార సమితి
ప్రాకార వజ్రదీప్రాకార హర్మ్యంబు కుంజరంజిత భద్ర కుంజరంబు
రమణీయతావాస రమణీయుతవిలాసి కాంచనసౌధాది కాంచనంబు
రాజహంసకులీన రాజహంస కులంబు బంధురమ్య గృహస్థ బంధురంబు
కల్పకానల్ప శోభనా కల్పకంబు । గోపురద్వార చుంబిత గోపురంబు
సింధుజన్మాశ్వ దేశీయ సింధుజంబు । గజపురంబొప్పు జితమరుద్గజపురంబు. 43
క. పనివడి యిల్లిలు దప్పక । కనుఁగొన్నను నెచటనిత్య కళ్యాణము ప
చ్చనితోరణమును గడుమెఱ । యనిగృహమొకటైనఁగలదెయాపురమందున్. 44
మ. అతిగంభీరత నీదఖేయమున నొయ్యన్నిర్గమంబంది సం
గతమోదంబున నాగకన్యకలు ప్రాకారాగ్ర భాగంబు లె
క్కి తదభ్యర్ణవి యత్తరంగ వతిలోల క్రీడల్ సదానల్పఁగా
ఘృతకాసారములీలభోగ వతివర్తించున్ఘణావత్పురిన్. 45
గీ. చుట్టి మిన్నంది కొనికోట సొంపుమీఱ । నడిమి మణిసౌధ వీధినింపడరెవీడు
పెట్టిఁబెట్టిన పడగల పెద్దత్రాఁచు । పైకిఁదేలిన విధమయ్యెఁ బరిఘమీఁద. 46
చ. జలరుహ శత్రుమిత్ర ఘృణి జాలముచేఁ బొలివోక నిల్చియు
న్వలయపుఁ గొండయవ్వలి యవార్యత మిస్రిమునేఁడు తత్పురిన్
విలసిత భర్మహర్మ్య రుచివేమఱు నల్గడసారి వెళ్ళఁగా
వలసలు సేయగాఁదొడఁగె వారకతద్ఘన గహ్వరంబులన్. 47
గీ. హిమకరుఁడుయానగతులనొక్కింతతడవు। మార్గవశమునఁగోటకొమ్మనువసింపఁ
బరిఘసొత్తెంచివచ్చితత్పురముచెలువు।భోగవతిఁజూడనిక్కినపొలుపుమిగుల. 48
ప్ర(క్ర్). అన్నగరంబునందు మణిహర్మ్యచయోపరి సీమకెక్కవే

డక్కెన్నలి నాక్షులయ్యెడ నెడంబయి చూపునిగుడ్చి చూచినం
గ్రొన్నన వింటివాఁడమర కుంజరు వీటి విటాలిపైని వాఁ
గ్రన్ననసేయఁ బూని విశిఖంబరి బోసిన చొప్పుఁదెల్పెడున్. 49

ఉ. హారిహిరణ్య హర్మ్యములయందు మెలంగు కురంగ నేత్రలన్
తోరణ గండ్ల మార్గమునఁజూచి తముంబెడఁబాసి మించు లి
చ్చోరమి యించుచున్నవని సొంపునఁ జేరెడు మాడ్కిఁజొచ్చిలో
శారద నీరదావళులు సారధిలేమి భ్రమించు నిచ్చలున్. 50

ఉ. క్రొన్నెలతోడెబంట్లొ లతకూనలొ బంగరు కీలుబొమ్మలో
చిన్ని మెఱుంగుదీగెలొ కొ చెన్నువహించిరి నాఁగనప్పురిన్
బున్నమనాటి రాత్రులను బుణ్యపుఁగన్యలు వాడవాడలన్
వెన్నెలకుప్పలాడుదురు వేడుక నువ్విళులూరఁ జూపఱుల్. 51

మ. జలజాతోత్పలహల్లక ప్రచయ చంచద్గంధముష్టింధయం
బులకించిత్ఫుల్ల పంకజ రజఃపూర్ణాంతరావర్త మం
డల సంచారముత్త్ర విహార గహనాంతర్వర్తి వాతూలముల్
చలువల్ చల్లు నహర్ముఖంబులఁ బురీ సౌధాగ్రవీధీతతిన్. 52

చ. ఘనతర జాలకంబులను కన్నపుగండ్లను దూరితెమ్మెరల్
ననపొడి చొక్కుఁ జల్లి మదన ప్రధనాంత వధూముఖశ్రమాం
బునిచయమౌక్తిక వ్రజము మ్రుచ్చిలిపాఱఁగ నూఱఁగాపరు
ల్వెనుకొని వెంటనంటి రనలేచెఁ దదంతర ధూపధూమముల్. 53

క. మరుదంకురములు తత్పుర। వరమణి సౌధములఁ గమల వనసౌరభ్యా
గురుధూపధూమ రేఖలఁ। బరివర్తనఁ జేసికొనుఁ బ్రభాతము వేళన్. 54

సీ. ఉత్తిష్ఠశుండా ముఖోద్ధృతస్వర్ణదీపానీయ కల్పిత పారణములు
బహుళఘనీభూత బహుళపక్ష క్షపాచటులాంధకార విస్మారణములు
జంగమవైఖరీ సంగత ధౌరేయ ధరణీధరౌఘ సాధారణములు
బలిత కోపావేశ బలనిషూదన ఘనకఠిన వజ్రోద్యమా కారణములు
స్వైరసంచార మండలీ సాహసిక్య। ధారణప్రౌఢిమా క్షమా ధోరణములు
విమత నరనాథ సైనిక వీరదర్ప। హరణంబులు తత్పురీ వారణములు. 55

శా. ఛత్రచ్ఛాయఁ బరిభ్రమించు ననిల స్కంధత్వరా సంగతిన్
జైత్రత్వంబునఁ బొంది దేవమణిభాస్వద్భోగ సద్భావమై
చిత్రిన్ వతిఁ లిసాధులన్ మనిచిమించెం బంచకళ్యాణుమై
ధాత్రీమండలిఁ బట్టభద్రుల గతిం దత్పట్టహాశ్వమ్ముల్. 56

గీ. జవన పవనంబుకన్నను జవముగలిగి । మలయు తమకెందుమఱియగమ్యంబులేక
కన్నుల కగోచరంబులై కనకకలిత । రథములమరునప్పురి మనోరథములట్లు. 57

క. చప్పుడు వినఁబడునంతనె । చొప్పడు గురులేయఁగలరు చోదులనంగా
నప్పురిగురిఁ గనిమేయుట । చెప్పఁగ నేమిటికిఁ గడువిచిత్రంబనుచున్. 58

సీ. వేదసమూహంబు విగ్రహవంతమై వెలసిల్లెవనమించు విప్రచయము
కీర్తి ప్రపంచముల్ మూర్తిభవించిన చందంబునొందు రాజన్యకంబు
నవనిధానంబులు నవయవ్వులైనట్ల వతిల్లునేప్రొద్దు వైశ్యసమితి
యారంభసంభార మాకారముధరించి మాపట్టు గతిఁబొల్చు శూద్రగణము
గీ. చైత్ర రథనందనంబులు శంభుమిత్ర । జంభశత్రుపురద్వయీసవిధవసతి
యుజ్జగించి ధరాస్థలి నస్సరీతి । కరిపురంబునఁ దనరె శృంగార వనులు. 59

ఉ. శంబరదైత్యు నుక్కణఁచి చక్కెరవిల్తుఁడు వానిమాయనె
య్యంబునఁబూని చేతి విలునమ్ములు నవ్వలఁబెట్టి తా వినో
దంబుల నైక రూపములుదాల్చి చెలంగెడినో యనంగ వీ
లం బురిలోఁజరింతురు విలాసిజనంబులు వాడవాడలన్. 60

సీ. పూవులసరులెత్తి భుజమూల మంజులీ కాంతిచేఁ జంపక భ్రాంతిఁజేసి
విరులఁగంటిరెయని వీక్షణంబులసన్నఁ గావించియుత్పల క్రమమొనర్చి
విలువచేమైజారు విదలించుకాంతిచేఁ గుందకుట్మలశంకఁ గుదురుకొల్పి
హస్తాంబుజంబుల నప్పటప్పటికెత్తి జలజాతవిచికిత్స సంఘటించి
యేకజాతి సుమంబు లనేకజాతి । కలితసుమనఃకదంబంబుగానొనర్చి
ఫలచితతతీపుఁ బుట్టించి పిలుతురర్థి । గట్టివాలుంబడంతు లప్పట్టణమున. 61

ఉ. వీడిన కేశబంధములు వీడియు వీడని నీవిబంధను
ల్వాడని కెంపువాతెఱలు వాడియువాడని యంగవల్లిక
లూఁడిన ఘర్మబిందువులు కూడియుఁ గూడని మందయానము

ల్వాడలఁ జూపవెళ్లుసురు వారవధూటులు వేఁగుబోకలన్. 62

వ. వెండియు నఖండ వస్తు మండితంబై స్వర్గ ఖండంబనంబరగి నిచ్చలు దమ్ము ము
చ్చమునిఁగించిన మత్సరంబునఁ బెచ్చు పెరిగి యిరులచ్చ వెన్నెల లచ్చంబున మె
సవిన యచ్చందంబునం దర్ధ వికచకుసుమ విసర గర్భితంబులైన ధమ్మిల్ల బంధం
బులవలనను, మరులుకొని నెఱి కురులను పెన్నుదుల తెరువునఁ గోరిక లీరిక లె
త్తం దారక లభిసారికలై ముఖ తుషారకరు చేరికకు నేఁగెడు ననం జెలువారు
చేర్చుక్కలఁ దనర్చిన సీమంతవీథులవలనను, థళథళ మెఱయు తొలుకఱి మెఱు
పుల మిసమిసమను వసంత లత లామనికడకుఁ బరప నొరవుగల కనుఁ గలువ
కోనల వెడలు తళుకుంజూపులు కర్ణంబులకు నన్నువయిడిన యిందునకుంబ్రీతి
గనుపకృతియు నరుగుచు నెనరుదనర ముత్తియపుఁ దటాకంబులని రాకావిధుచం
ద్రికల నీను వీనులవలనను, నెమ్మోము చందంబుల కమ్మ దనంబునకుం గ్రమ్ము
కొను కొమ్మతుమ్మెదలకు వెలబొమ్మలైన ఘ్రాణ చంపకంబులను, వంశ నాళం
బుల నాళీక నాళికుండు సుర ఘంటాపట పర్యట ద్విటపర ధీరతావిహంగంబుల
పడ నూదంబూనిన కప్పురపుటుండల తెఱంగునఁ జెలంగు నాసికా రత్నంబువల
నను, విసిద్ర విద్రుమ్మభంగంబులపై నక్షుద్ర సముద్ర వీచీ మగద్రా జీవశంబునఁ
దలఁపోప తండంబులై నిండిన డిండీర మండలంబు పగిది రంజకంబైన కెంజిగురు
పుంజంబుమీఁదఁ జలించు మంజుసుమ మంజరుల చందంబున బొమ్మించు గెమ్మో
వులను సాంధ్యరాగంబుపైఁజాలుకొను చిరునగవు సోగ వెన్నెల వెల్లికిందల్లడిల్లి
పయ్యెద చెఱంగుల మఱుంగిడుకొనియు మదిబెగడుడుగుపఱచి మొగమనెడుతొ
గలచెలి మొగిదలకు నెగరందలఁచి పరిచయముగఁ దొలుదొలుత పిల్ల చందురుల
నంక భాగంబులఁ గలయనిడుకొని ముద్దాడు జక్కవకవలకై వడి నమరు నఖలి
ఖిత రేఖాలంకృత కుంకుమ కుచకుంభ యుగళంబులవలనను, సుకుమార బహు
మృణాల వల్లికాగ్రంబునం జెంగలించు ప్రశస్త హస్తారవిందంబులచుట్టు నావ
ర్తించు కేసర పరాగభరిత భసలకలభ విసరంబును బోలెఁ బొలుచు హరినీల
మణి కంకణంబుల వలనను, నభః కుసుమమాలికా వికాసంబు లాశ్రయాసిద్ధం
బులను నైయాయికసిద్ధాంతంబు ప్రత్యక్షప్రమాణంబును బూర్వ పక్షంబునుగా
వింపంజాలిన నెన్నడిమి పొక్కిలి పొన్న పూవుల వలనను, నెత్తంపు నెత్తమ్ముల

చెలువమ్ము గల చరణమ్ములకుఁ దారొకొన్న రవిమయూఖ మంజరుల పోలి
కందనరు సింజానమంజు మంజీరంబులవలనను రంజిల్లి యొరలుదివిచి జడిపింపఁ
బూనిన యించువిలుతుని తళుకుఁ గైదువలకైవడి వెలంగు వారనారీమణి కదం
బంబులవలనను నభిరామంబై యొప్పు నప్పురంబునకధీశ్వరుండు. 63

చ. శరణనికోరివచ్చి తనుసాగిలి మ్రొక్కిన వైరికోటులం
గరుణనుజూచి మాన్పులయుగర్వ మహీశుల గీటడంచి భా
స్వర భుజవిక్రమావృతకు సంవరణుండయి సంతతంబు సం
వరణుఁడు తత్పురీవర మవారణ నేలె నతిప్రతాపుఁడై. 64

ఉ. అక్షయ వస్తుసంపదల కాకరమై సురకోటికెంతయు
వీక్షణహృద్యమై భువన విశ్రుతిఁ గాంచిన హస్తినాపురీ
రక్షకుఁ డానృపాలుఁడు కరంబనురక్తి మెయిన్ వసించె బం
చాక్షరి యందునున్న త్రిపురాసుర వీరవిభాళు కైవడిన్. 65

చ. నరహర దైత్య సంహరులు నైజవరాంశములెల్ల నొక్కచోఁ
దిరములుగా నొనర్చి జగతీతలమెంతయు నేలవచ్చి ని
ల్చిరనఁగ నామహీరమణ శేఖరుఁ డారయఁ జెల్వుగన్ క్షమా
భరణమనన్ వృషాభిరతి వాయని జక్రపుఁ బంపు సేయుటన్. 66

ఉ. సంగర రంగభూములను సంవరణ క్షితిపాలు సద్భుజా
సంగత ఖడ్గరాహువు విశంకట టంకనిరంక శౌర్య ని
ర్భంగ విరోధి యూధముల పాండురకీర్తి మృగాంకుఁ బర్వ సం
ధింగబళింప శోణతటి నిండఁగఁ గ్రుంకును భూతసంఘముల్. 67

మ. బలవద్విట్సహకారియై దనుజులం భంజించు నమ్మేదినీ
లలనాధీశ్వరు సద్గుణ ప్రకరముల్ గంధర్వ లీలావతీ
తిలకంబుల్ గణుతించి చందురునియందే బింబసారంబుచే
సెలగవ్రాసినరీతిఁ దెల్పును విధుచ్ఛిద్రంబుఁ దారావళుల్. 68

సీ. కరుణారసపుఁజూపు నగుణాభమగుతూపుఁ దగహితాహితులపైఁ దగులఁజేసి
నిశిత తేజస్స్ఫూర్తి విశదరాజతకీర్తి పుష్పవంతులతోడఁ బోరఁజేసి
యుచిత శిక్షారూఢి రచితరక్షాప్రౌఢి దుష్టశిష్టులమీఁదఁ దొడరఁజేసి

ధీరతామహిమ యుదారతాగరిమయు సురసగంబులఁ గిన్కఁ బరగఁజేసి
ధరణిఁబాలించెఁ గీర్తిదీప్త ప్రతాప । భయవశాంఘ్రి సరోరుహ ద్వయసమీర
వినమదజరత్తరవిబింబ వితతరూప । వరకిరీటార్ఘ్యరిపుఁడు సంవరణనృపుఁడు. 69

ఉ. సారవిభూతి రెండవ వృషధ్వజుఁడాకృతిచేఁ దృతీయ బృం
దారక వైద్యుఁ డిద్ధ శుచితాగుణమందుఁ జతుర్థ పావకుం
డారయ భూమిమోచుటకు నైదవ దిక్పతి దానరేఖచే
నారవ కల్పవృక్షమన నన్నరపాలుఁడు మించెఁ గీర్తులన్. 70

శా. ఆరాజేంద్రు ప్రతాపవహ్ని దివిజేంద్రా రాతి ఘోరాటవీ
ఘారంబుల్వెస నేర్చి వజ్రము పసల్వారించినం గాంచి దు
ర్వారజ్వాల కరాళ బాడబశిఖావద్దావధూమధ్వజు
ల్తోరంబైన భయంబునన్జలకుభృద్ద్రోల్ స్వర్ధునుల్ రుద్ధతిన్. 71

గీ. ధాతవన్నె చూడఁ దత్తేజ మొరయఁగా । మెఱుఁగు వచ్చెఁగాక మేరుగిరికి
శైలరాజమునకుఁ జామీకరప్రాప్తి । గలిగియుండనేమి కారణంబు. 72

చ. వికట విరోధి రాజులటవిన్గిరిదుర్గము లాశ్రయించి యొం
డొకరికిఁ బెట్టకుండ్రెన నృపోత్తముఁ డందఱ క్రొవ్వడంచి ము
న్వికలులఁజేసి క్రమ్మఱఁగ నిల్పనునారుబలిష్ఠమైనఁ గ
ర్షకుఁడది పెల్లగించి యుపరస్థలి నాటిన చందమొందఁగన్. 73

ఉ. శాలివనంబులందిరుగు శారికల న్రొదచేసి రొప్పుచున్
జేలఁబడింజరించి నునుజేల చెఱంగున నాననశ్రమాం
భోలవముల్హరించుచు నృపుంగవు నాతనిఁ బాడుచుండు రా
బాలవయః కథానుగుణపద్ధతిఁ బామర భామినీజనుల్. 74

క. ఇలభరియింప నృపాలుఁడు । తలయెత్తిన నాఁడు మొదలు స్థైర్యముతోడ
న్దల లెత్తిరి ఫణివల్లభ । కులశైలదిగంత దంతి కూర్మ కిటీంద్రుల్. 75

క. మానసభవు చెలువంబున । మానుషముగ గెలిచియున్న మహిపతిఁ గానిరో
మానవతతులిడఁబోయిన । మానవ సతులకును ధరణి మండల మందున్. 76

ఉ. ఆతని చెల్వమెట్టిదొ ధరాధిప జైత్ర తదీయ దండయా
త్రాతదనంత రోద్ధత పరాగము మిన్నులు ముట్టినట్టి వే

ణీతట సంగతంబయిన నిజకరవల్ల భురాణి కల్పకో
ద్యానలతాంత రేణువని బొంకును భర్తకుఁ దత్ప్రియంబునన్. 77

క. ఆరాజన్య కుమారుఁడు । తారుణ్య వయోవిభూతిఁ దనరెవసంత
ప్రారంభ సమయసంభ్రమ । సారశ్రీకలిత నవరసాలముఁబోలెన్. 78

వ. ఇవ్విధంబున నవయౌవనారంభంబున జగన్మోహనాకారుండైనవ్వాఁడు బరువం బుగల పువ్వుకైవడి షోడశ కళా సంపూర్ణుండై యుద్దాన రేఖా లక్షితుండైనభ ద్ర దంతావళంబు రేవ ననన్య సామాన్య లావణ్యంబునకు నాటపట్టయి కంతుజ యంత వసంతాదుల మందాక్ష భరామంద పారావార నిమగ్నులంగావించి పి క్కటిల్లిన చక్కదనంబునకు దిక్కయిన యక్కువలయేశ్వర మూర్ధన్యుం డొ క్కనాఁడు. 79

సీ. బృందారకానీత మందారదామంబు కమనీయమౌళి భాగమునఁజుట్టి
ఘనమూత్న నవరత్న ఖచితకిరీటాది కలితభూషణము లంగములఁబూని
మృగమదకాశ్మీర మిళిత చందనచర్చ మిసమిసల్వారంగ మేననలఁది
జిలుఁగులులోవంక మెఱుసరింగులువారఁ బసిఁడిఁద్రాఁతలపట్టుపటముగట్టి
కటకవాహ్యాప కంఠ శృంగారవనము । చూచు వేడుక వెడలెఁగంచుకవితాన
జయజయధ్వానసంభ్రమసమయమిళిత । మహితరాజితమగుసభా మంటపంబు.

వ. ఆసమయంబున సేవాసముత్సుకులై యొండొరులంగడచి నడతెంచి యంజలిపుటం బులు మకుట తటంబుల ఘటించు నిఖిల దేశాధీశ్వర కుమారుల నవలోకన మా త్రంబునఁ గృతార్థులంగా నొనరించి, విగళిత నితంబంబును, దట్టల్లతా సముల్ల సితకనకరజ్జు సంయుతంబును, ధగద్ధగిత వివిధ కిరణ భరిత సురథ సుస్థలిత ని స్తుల పరిస్తోమంబును, గండస్థల పరిస్రవన్మద జలాసారదుర్దినంబునగు గంభీరవే దియను కుంభీంద్రంబు నారోహణంబు సేసి ప్రావృషేణ్య వాహంబు నెక్కిన పర్జన్యు చందంబున ఘంటాపథంబునఁ జనునెడ దివిజనిచయంబు పుష్ప వర్షం బులు గురిసెనో యన హర్మ్యాగ్ర భాగ సంచత్పుర వధూజనులు చల్లిన యా చారలాజ సమాజంబులు పయిందొరుగ నల్లనల్లన గంభీర గమనంబుల నారా మంబుడాయఁజని గజావ తరణంబొనరించి హితమిత పరివారపరివృతుండై.

సీ. మాకందమందార మల్లికామాలూర మాతులుంగ మధూక మండితంబు

కహ్లారకదళికా కరవీర కౌశిక కుందరాళి కదంబ కాంతిదంబు
వాసంతికావల్లి వకుళవంజులదివ్య వరపర్ణి నీవార వైభవంబు
రాజవృక్షరసాల రాజోదసస్థల రాజీవ రాజీవిరాజితంబు
నైనయాకేళి వనవీధి కాంతరంబుఁ । జొచ్చి సలలిత ముకుళిత సుమితఫలిత
తరులతా విభ్రమంబుల నరయనిచ్చి । చాలఁజూపట్టె నవ్యవసంతుఁడనఁగ. 82

సీ. మవ్వంపు విరవాజిపువ్వుఁ గొమ్మలలోనఁ జిక్కిన కలిగొట్టు చెట్టుఁజూచి
గురువింద పూగుత్తి గుబ్బలతాకునఁ బులకించు నెలమావి పొదలఁజూచి
మొల్లంపు మొల్లల పల్లవాంగుళముల గిలిగింతలకునొప్పు ములగఁజూచి
పరిసర ఫణిలతా పరిరంభణంబున మ్రాన్గొన్నలేఁబోక మ్రానుఁజూచి
తనమనంబున ముచ్చటఁ గనినరీతి । సౌరదివ్యోడఁ బలుమాఱుచుట్టివచ్చి
యుర్వరామండలేశ్వరుండొయ్యనొయ్య । నరిగె వేఁటొకతరువాటికచటు గదలి.

శా. రక్తాశోకము యావకద్రవ పరిభ్రాజద్వధూపాదసం
సక్తిం గోరక సేవగించు గతి లజ్జాసక్తి తానంగుఁడై
రక్తాపాంగుఁడు రాజుచేరె నవలన్ ద్రాక్షావలిన్ సూత నా
సక్తుల్గారె తలంప నెట్టియెడల న్సర్వంసహాధీశ్వరుల్. 84

ఉ. క్రాలెడు పూవుగుత్తుల శిరంబుల గెంజెడలట్లు తాల్చి ని
ర్లోలము నిద్రుమంబుల విలోకనఁజేసి సుమచ్ఛలంబున
న్బాల వధూకము ల్తపసుపండిన వెన్కజడ ల్ధరింపఁగా
నేలయటంచు నవ్వఁగ మహీవలయేశుఁడు చూచె వేడుకన్. 85

గీ. మదట్రబండిన దానిమ్మమ్రానిపండ్లు । శుక్తికైవడివిరిసినఁ జూచివిభుఁడు
పద్మరాగంబు లపరంజి పాత్రనునిచి । యారతిచ్చెనువనలక్ష్మి యనుచుఁబొంగె.

క. మలయాచల నిలయానిల । వలయాచలగతుల రాలె వనకుసుమంబు
ల్వెలిచాగవిలుతుఁ డవ్విభు । చెలువున వెఱఁగంది వదలుచే దూవులనన్. 87

సీ. గడెనున్నదామేఁటి గమికాని పెనుచిప్ప పదభద్రపీఠమై కదలకుండ
నతలాదికములైన నైదురెండు జగంబులాల వాలఖ్యాతినావహింప
నంతరిక్షంబెల్ల నాద్యంతమునఁజూడఁ బ్రకటప్రకాండమై పరగుచుండ
స్వర్లోక జనలోక సత్యలోకంబులు శాఖాశిఖా ప్రదేశములుగాఁగ

నరయనీ రేఁడు జగముల నాక్రమించి । విశ్వరూపంబుఁ గైకొన్న విష్ణు కరణి
నమరికన్నుల కద్భుతం బైతనర్చు । ఘనరసాలంబుఁ గాంచె సజ్జనవిభుఁడు. ౮౮

వ. వెండియు నయ్యామ్ర భూజంబు భూచక్రంబునకు నీడగాఁ బట్టిన హరిదాత పత్రంబు చందంబున వియత్తలంబు నొత్తరించి నెత్తమ్మినంటు మించు నొక్కించుకయు సుడియనీక యాచ్ఛాదించినం గినుక పొడమిన మాడ్కి వేడి చూడ్కిం దెకతెక నుడుకం జేయు తోటం దరుగుహాముఖంబుల నెటి నిర్గమించు చంచరీక సంచయంబుల కరువలిందవిలి రవులుకొన్న యరవలియుం బొవలనుంగా గగనపథంబునం దిరుగు నెడం గిసలయపుటంబులం దగులువడిన యుడుగణంబులు మద కరటి కుంభ యుగళ విదళన ప్రకట కంఠీరవ ఖర నఖర ముక్తంబులగు ముక్తాఫలంబులుంగా గులమహీధరంబు సారూప్యంబు వహించి యొండొకయెడ నిరశన పథంబునం బ్రవర్తించు పరభృత భ్రమర కీర విసరంబులకు ననవరతాన్న సత్రంబు లిడినక్కైవడి పల్లవగుళుచ్ఛ ఫుల్ల కుసుమోల్లసిత ఫల తల్లజంబులచేత సల్లలితంబై నభోమధ్య సమధ్యాసీన తారకా లింగేశ్వరునకు స్థాణుత్వంబు నివర్తింపంజేయు శాఖోపశాఖలచే నభిరామంబై నిలింపదంపతులకు విహరణ స్థావరంబై నక్షత్ర గ్రహతారకంబులకు విశ్రమ నివాసంబై యుండ నద్భుతంబును నతియశ కౌతుకంబును జెనంగొన్న మనంబుతో నమ్మోదనీశ్వరుం డమ్మావి నీడకల్లల్ల నరుగుదెంచి యమ్మెయడ నొక చంద్రకాంత శిలాతలంబున సుఖోపవిష్టుండైన సమయంబున. 89

క. ఘృణిశాలి కంకణారుణ । మణిపంక్తిం గాంచి దాడిమఫలాశనుఁడ
న్మణిబంధముపై వ్రాలెను । గణుతించుచు నొక్కచిలుక పటువేగమునన్. 90

సీ. పులుదిండిమ్మానికంబుల వన్నెగలయీఁకెలొకపంకఁజేఁకట్ల నసుకకొలుప
గరికిచాయనుమించు గరుదంచలచ్ఛాయ హరిణంబులకు నడియాసకొలుపఁ
గుంకుమపక్షము లుఱ్ఱవలయ రక్షక క్షౌమవాసముచంద్ర కావిగట్ట
నచ్ఛగౌరచ్ఛద గుచ్ఛంబులొక్కచక్కి దీనారటంకాల శోనగురియ
విశదపత్రంబులొక్కచో విస్తరించి । చక్కఁజందురు మిసిమినిధిక్కరించి
దివ్యమగు రాజకీరంబుఁ దేరిచూచి । నృపతి యొక్కింత తడవునిర్నిమిషుఁడగుచు.

ఉ. వ్రాలిన పంచసాయకుని వార్వము నీక్షణచేసి విస్మయో

ద్వేల కుతూహలంబులు మదిందగుపారఁ బయోధిమేఖలా
పాలక మండలేశ్వరుఁడు పద్మ ఝషధ్వజ లక్ష్యమైన కెం
గేలఁదదంగము న్నిమిరెఁ గేళిరసార్ణవ మగ్నచిత్తుఁడై. 92

గీ. రూపసంపద చెల్వమునోపలేక । యోడె జాబిల్లి మేనల్లుఁ డుపథగాఁగఁ
దనమ సామ్రాజ్ఞి తేజీని బనుపఁబోలు । ననుచుఁ బలికిరితమలోన నాత్మజనులు

వ. అయ్యవసరంబున నారాజకుమారుం డనేక ప్రకారంబుల గారవించి యపార కారుణ్య రసకూలంకష హృదయపంకజుండై సద్యోవిలాస పచేళిమ సహకార ఫలంబులం దెచ్చి యిచ్చిన వామేతర చరణంబుపై నుంచి చంచూ పుటంబులు విదళించి మధుర రసంబు లాస్వాదించి కరాం గుళి నిపీడిత రసాల రసంబులు గ్రోలి తదీయాంగుష్ఠంబునకుం జీరమణిలు నిమురుకొని యుండ నచ్చిత్రవర్ణ విహంగ పుంగవంబుతో నారాచ సింగంబు ధనుర్ధరుండైన పురుహూతు చెలువం బుదాల్చియుండెఁ దదనంతరంబ. 94

ఆశ్వాసాంతము.

శా- పాటీరాచల హాటకక్షితిధర ప్రాక్పశ్చిమ క్షోణీ భృ
ద్వాటీ కూటగుహానిబద్ధ ఘనవ ద్రాఘిష్ఠ శార్ఙ్గాయుధ

* * * * *

ధ్ధాటీ దుందుభి ఝాంక్రియా బధిరి తద్యావాపృథివ్యంతరా 95

పంచచామరము.

కళావతీమ తల్లికా వికాస గల్లపాలికా
విలాస దర్పణావలోక విభ్రమైక లాలసా
గళద్గళ స్థలత్పద ప్రగల్భ నిష్ఠతచ్ఛర
శ్ఛలత్రుబంధితాహిత ప్రచండ చంద్రహాసకా.

గద్య. ఇది శ్రీమద్గురు కృపావిశేష లబ్ధ సార సారస్వత పవిత్ర విలస ద్దంకి వీరయామాత్య పుత్ర సరస గుణసాంద్ర గంగాధర కవీంద్ర ప్రణీతంబైన తపతీ సంవరణోపాఖ్యానంబను శృంగార కావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.



## తపతీసంవరణోపాఖ్యానము.

### ద్వితీయాశ్వాసము.

క్ష్మామతుకవలయపాలన । సామర్థ్యవిశేష శేషశయన జయ శ్రీ
ధామ మహౌన్నత్యకళా । హేమాద్రికులేంద్ర మలికి యిభరామేంద్రా. 1

వ. అవధరింపు మారాకుమారుండు సవయస్కులగు సఖులతో నిట్లనియె. 2

ఉ. ఈశుకరాజు నెయ్యెడల నెన్నఁడు నేను మదీయపట్టణా
భ్యాశ వనాంతరాళ తరుపఙ్క్తులఁ జూచి యెఱుంగ మున్ను మీ
రీశబలచ్ఛద చ్ఛురితహృద్యతర ద్విజశేఖర ప్రతీ
కాశకమైన రాచిలుకఁ గంటిరె! చప్పుఁగనైన వింటిరే! 3

సీ. ఎందుండి వచ్చెనో యివ్వనస్థలికిని బంచవర్ణంబైన పక్షిరాజ
మెచ్చోటనుండెనో యీబింబఫలభోజి మనపొలాన మెలంగ మనమెఱుంగ
మిదిప్రోది చిలుకయా నెన్న నన్యముగాదు ప్రాసిపైఁ జిలుకకై మఱిఁగియున్నె
యిదియుండు వనవాటియేలనే మిటవెల్తి యాసేచనకమూర్తి యండజంబు
భారతీదేవివీణతోఁ బలుకుచిలుక । యిదియకాఁబోలు లేకున్న నీధరిత్రి
నమృత మధురాక్షరములైన యట్టిపలుకు । లితరకానన శుకరాజికేలగలుగు. 4

సీ. కలిగెఁబో మనకేలి కనకపంజరశారి కలకెల్లఁ జదివింపఁ గడఁగునొజ్జ
యబ్బెఁబో మనరాజ హంసమండలికెల్లఁ గవనముల్ వినిపించు కవివరుండు
చేరెఁబో మనప్రోది చిలుకబోదియలకు గానవైఖరి నేర్పు గాయకుండు
దొరకెఁబో మనగృహాంతర మయూరములకు నాట్యంబు శిక్షించు నటవిభుండు
మనభవననర్మ విపినసీమంబులందు । వితతమధురఫలంబుల విట్లువీఁగి
చాలసంపన్న గార్హస్థ్యలీలనున్న । యామ్రసాలాది తరువులకమరెనధిప. 5

C

క. ఇదె మాడుండె పతంగము । మదిలోన సదుత్తరముగ మఱుమాటాడం
గదిరెడుగతి నేఁబలికెన । యుచితంబుల నాలకింప నొగ్గడువీనుల్. 6

వ. అని బహు ప్రకారంబుల సబహుమానంబును సానురాగంబును సోల్లాసంబు నుంగా నెచ్చెలులకుంజూపి యారాజ తిలకుండు పలుకుచున్న సమయంబున రా చిలుక మనుష్యభాషణంబుల నిట్లనియె. 7

—— తపతీ సౌందర్యము రాజుతోఁ జిలుక చెప్పట ——

ఉ. భూవలయాధినాథ! పరిపూర్ణకృపైకనిధాన! నీమనో
భావక భావుకత్వపరిపాటికిఁబాటికి రావతప్రియం
భావుక మామకీయ మృదుభాష లశేషకళావిశేషవి
ద్యావిభవప్రభుత్వము నుపార్జితసర్వజగత్ప్రశంసయుక్. 8

వ. మహానుభావా భవదీయ పరిజ్ఞాన చాతుర్యంబునకు మముబోటి తిర్యగ్జంతువుల కు నెంతదూరంబు నీహస్తావ లంబనంబు గలుగుటంజేసి ప్రశస్తుండ నైతె; చరితా ర్థుండ నైతి; పురాకృతంబులయిన సుకృతంబులు ఫలోన్ముఖంబులయ్యె; నీవకారణ బంధుండవు. కాన భవద్దర్శన ఘటీయంత్రంబు మదీయమనఃకూప కథారసంబుల వెడలించుచున్నయది; మీయానతిచ్చిన ప్రకారంబు నగుదు; నస్మదీయ వృత్తాం తంబు వినిపించెద; సావధానమతివై యవధరింపుము. 9

సీ. బంగారురంగైన బ్రహ్మాండభాండంబు మెఱుఁగడు నెవ్వానిమేనిచాయ
భర్మభూధరశృంగభాగంబు నారవెట్టుఁ బ్రతిదినం బెవ్వానిరథపథంబు
ముకుళితాంబుజబద్ధముఖరాళిమోక్ష జాతోత్సవం బెవ్వానియుదయవేళ
గ్రహచిత్రితాకాశరంగవల్లికఁ ద్రొక్కు సివసత్తు లెవ్వానిసితకరములు
రజనిదినములు మేర లేర్పఱుపసమతఁ । గడఁగు నెవ్వానిసూతుఁడగ్గగనమణికిఁ
దపతియనఁగలయువతిరత్నము జనించె । రత్నమునఁబుట్టు నొండొకరత్నమనఁగ.

ఉ. సారససంభవుండఖిల సర్గనిమిత్తముగూర్చియున్నశృం
గారరసంబు నెల్లనిడి కౌతుకమొప్పఁగ నీతలోదరిం
గారచియించెనొండొక సుగంధిస్సఁసంపఁగలేమిఁ బట్టుచే

బారలువెట్టుఁబిమ్మటను బచ్చిసబుద్ధులఁగా కెబ్రాహ్మణుల్ ! 11

చ. అనయము కోమలాయతము లాచమరీమృగవాలభారముల్
వెనుకకులెస్సయుండునఁట వేమఱునిప్పటవేళ నానితం
బినినునుసోఁగవెండ్రుకల మేలిమికిం బ్రతియంచునందఱుం
✓ బనివడివచ్చితోకలెగబట్టుదు రేమనవచ్చుభూవరా ! 12

చ. కమలముపూర్ణచంద్రముఁడు కాంతిరుఝరైక నిదానులయ్యునీ
రమణిమొగంబుచెల్వునఁ బరాజయమందుట సిద్ధమిప్పుడుం
దమకుఁబరస్పరంబు ముఖదర్శనమబ్బినవేళఁ దమ్మినే
గమెముకుళించుఁ జందురుఁడుగందు మనంబునసిగ్గుజేఁగదా. 13

గీ. చకచకఁదనమున నాసరోజాతగంధి। పాటికలకంఠిలేదని పద్మభవుఁడు
✓ వ్రాయులిపికాస్పదంబదే వనితనుదురు। వెతెయిడుగంగ నేలతద్విభవలీల. 14

క. లోకేశుఁడు నిర్మించుచు। నాకామినిఫాలఫలక మందక్షరముల్
✓ తేకులుగవ్రాసియిరుగడ। శ్రీకారములిడెనయట్లు చెలువగువీనుల్. 15

క. తెలివకటివంకబొమ్మలు। తెలఁగంటిసిడెంబుగలుగు ధీరునిచేతఁ
మెఱయువెలిచాగవింటికి। వెలబొమ్మలనంగఁదనరువిభ్రమమెసఁగఁ. 16

సీ. ఇంతికన్నులతోడ నీడనవచ్చునే గండుమీలవినీరుగారుచుండు
నతివచూపులకును బ్రతియనవచ్చునే మరునిబాణములకు నెరసుదఱుచు
తరుణిదృష్టులతోడ సరియనవచ్చునే కలువపట్టపగలు గానలేదు
పడఁతిచూడ్కులతోడ బాటనవచ్చునే కేఁజీకులైననీరేరుహములు
నీరుగ్రమ్మక మెచ్చోటనెరసులేక। చూడఁదగియెల్ల పొద్దునుసొంపుపూని
కొలఁదివెట్టినఁ దరగవకోమలికిని। జేరలంతలుగన్నులు ధారుణీశ. 17

గీ. తరుణినాసతోడ సరిపోలఁజాలక। చాలనుడుకుచుండుఁ జంపకంబు
లందుకతనఁగాదె యఖిలజనంబులు। ముడువనొల్ల రిపుడుతోడవుగాను. 18

క. ఆకమలానన పలుకుల। నే కోరిశుకంబు లుండు నెడబాయకయి
య్యాకలము మెసవి పలికెడి। కోకిలముల కథయదెంత కువలయనాథా. 19

సీ. చిఱువేరుచాయతోఁ జెలిమిసేయునుగాని తొలుసంజమసలక నిలువలేదు
మసలనివాన్నెచే మహిమగాంచునుగాని పవడంబుఖరిత మార్దవముగాదు

మార్దవభరితమై మలయుచుండునుగాని తలిరాకుమాధుర్యధర్మిగాదు
మాధుర్యధర్మియై మహినిరంజిలుఁగాని బింబంబు గంధబంధంబుగాదు
పలుకఁబాలని కెంజాయఁ బరిఢవిల్లి । మార్దవసమంజసంబయి మధురమగుచు
వదనపంకజ వాసనావళితమైన । తరుణికెమ్మోవితలఁపఁ జక్కెరలదీవి. 20

క. పవడంపు మోవికెంపున । సవసవగాఁ జంద్రికావిచరినద్దిన య
ట్లవిపలువరుసలె యమరును । నవదాడిమ ఫలచయంబునలువుదలిర్పక. 21

గీ. తరుణకలకంఠకంఠి కంధరముతోడఁ । జెలిమిచేసిన జలజంబుచులుకనగునె
✓పోరిపోరికడా తమవారి కెడసె । బల్లిదునివైరిఁ గూర్తురేబంధులైన. ✓ 22

ఉ. సూనశరాసనుండయిన జోదుకుఁదూణవిభాతినున్నయా
మానవతీభుజంబులను మార్కొనశక్యమె పంకజాకరో
ద్భానమృణాళ వల్లులకుఁ బైనిబటారమెకాకవారికిన్
లోనలొటారమాట మదిలోకులెఱుంగరె వేయునేటికిన్. 23

ఉ. అక్రమలాక్షిహస్తముల యందమునేమని విన్నవింతునే
నొక్కొకవేళ నక్కసలయోష్ఠి సమీపమునందునున్నచోఁ
జొక్కపుఁదమ్మిపూవులనుచుందరుణభ్రమరాళివ్రాలఁగెం
పెక్కినపల్లవంబులను నిచ్చనుడాయును గండుఁగోయిలల్. 24

గీ. పద్మకోశస్తబకకోక పద్మకుంభ । కలశములబాల చనుదోయిగెలుచుటరసి
పేరుకొనిదుఃఖమిహపంచభిస్సహాయని । మనుసునెవ్వనుడుగునద్రిమండలంబు. 25

మ. నవలావణ్యపుఁ గుప్పలైనచనుఁగొండల్ రెంటినెంతేయుఘ
ష్టవిహారంబులుసల్పి నాభియను కాసారంబులోఁ గంతుదం
తివగాహంబొనరింపఁ బోవనటమధ్యే మార్గదానాంబుసం
భవరేఖా కృతినారుకాఱుకొనియెం బద్మాక్షియంగంబునన్. 26

క. శృంగారపూరితంబగు । నంగననాభీ తటాకమందురువడిమై
నంగజగజంబు మునుఁగఁద । రంగలుపైకుబ్బినట్లు రంజిల్లువళుల్. 27

క. వడిగలసుడియొడికారము । తడఁబఱుపంగడఁగునాభి తరుణికిసమరేకన్
నడిమిసదసద్వివేకము । కడఁగానకకుండలించెఁ గంతుండనఁగన్. 28

గీ. అలఘుశృంగారవారి పూరాభిపూర్ణ । తరణిసుతగాన నాభిగర్తంబునందు

మండలావర్తసంచార మహిమగలిగి । ఘననితంబంబు పేర్సైకతముఁదాల్చు. 29

చ. దళసుమనశ్శలాటుఫలతల్లజకాండమయాత్మదేహముం
దిలపరిమాణమైనఁగడు నిష్ఫలమైచనకుండ నెల్లవా
రలకుపకర్తలై తగుపురాకృత పుణ్యవశంబునంజుమీ
యలికులవేణి కూరుయుగమై వెలసెం గదళీమహీజముల్. 30

ఉత్సాహ. హరిమనోజకుంటుంబరూపసమగ్ర కీర్తిపరిస్ఫుర
ద్విరదకాహళియుగ్మముం గొనిదేవతాగ్రణి మైనపం
కరుహగర్భుఁడొనర్చెనో యనఁగ గ్రమకాంతి కరంబులై
సరసిజాక్షికిఁజెన్నుమీఱెనుజంఘ లంగజమోహనా. 31

క. నెత్తములునత్తమిల్లిన । నెత్తమ్ములుగ్రిందుపడిన నిర్భరభీతిక్
లత్తుకయాచెలిచరణము । లత్తుకకొలువందొడంగె ననవరతంబుక్. 32

మ. నయనోల్లాసకరంబులై కువలయానందైక సంధాయులై
జయశీలప్రసవాయుధ ప్రకటతేజఃపుంజవర్ధిష్ణులై
స్వయముత్కంఠ చకోరదంపతిచమూ సౌభాగ్యయోగ్యంబులై
నియతింజంద్రమణీ నఖేందురుచులున్నిద్రంబులై చెల్వగున్. 33

చ. తరుణి శుభాంగరాజ్యమును దారొకన యౌవనరాజుచేరఁగా
సరగునబాల్యరాజువెడజారిన యప్పుడు మధ్యభూమినిం
గరువుజనించెఁ జన్గవయుఁగయ్యముకై మొనలేర్చె త్రొమడాం
బరములరాజకంబయినపట్టున నెట్టును బుట్టకుండునే. 34

క. ఎలజవ్వనంబుగూడిన । లలనారత్నం బగణ్యలావణ్యముతో
నెలసెల్లెనాడునాటికిఁ । బులుగడిగినముత్తియంబు పొలుపుదలిర్పన్. 35

చ. తపనుని మేనఁబుట్టెరి సుధామినులిద్దఱు కమ్రకాంతియుం
దపతియనంగనందొకటి దట్టపుఁజీఁకటికప్పుమన్నెముల్
చపలతఁబాఱఁగొట్టు నిమిషంబున రెండవ యీసుగంధిప్రా
యపునృపకోటి యాత్మమదనాంధముఁ గప్పునుధాత్రిచిత్రముల్. 36

క. వాచావధూవిడంబిని । యాచారుకటీరథాంగయాసకలకళా
వైచిత్రినిగావున నా । కాచార్యత్వమువహించె నయ్యమహీంద్రా. 37

సీ. ఆగమంబులతోడఁ బారంగతుండుగా నిగమముల్ సరహస్యముగ నుజదివి
కావ్యజాలము నలంకారముక్రింబుగాఁ గరతలామలకంబు గా నొనర్చి
భాష్యఫక్కికపాఠ పాతంజలజలంబు లాలాజలంబు గా లీలఁ గ్రోలి
మీమాంస లేకుండ మీమాంసయుఁ బతించి బ్రహ్మసాక్షాత్కార భావమంది
పేరుబలమునఁ దత్త్వవిచారగరిమ । శుకమహాద్విజముఖ్యుతో సూడువట్టి
యున్నవాకిక నితరాంధ్రియుక్తి యెంత । హస్తిపదమున నడఁగవే యడుగులెల్ల.

వ. ఇవ్విధంబున మద్దునుమూర్తి యగు నవ్విదుషికి నవయౌవనంబు ఘటికాభాజనజలంబు చందంబున వసంతసమయ సంతానలతిక చందంబున నున్న మనంబున నిట్లని వితర్కించితి. 39

ఉ. ఎవ్వఁడొకో ప్రతిక్షణము నెక్కువగా నభివృద్ధిఁ బొందునీ
జవ్వనిగోరు వెచ్చని కుచద్వయదుర్గము లాశ్రయించి క్రొ
మ్మవ్వపుఁదీగ వోలు రతిమానిని కౌఁగిట రాజ్యలక్ష్మిచేఁ
గ్రొవ్విన సూనసాయకునకున్ మదిఁ గొంకక బాము వెట్టెడున్. 40

చ. జలజదళాయతేక్షణకుఁ జక్కదనంబు విలాసవిభ్రమా
వళియు నొనర్చినట్టి యలవారిజసూతి యవశ్యమిమ్మహా
స్థలమునఁ దత్సమం బయినఁ జక్కని రాజు సృజింపకుండునే
నలువగు హారవల్లికిని నాయకరత్నముఁ గూర్చువైఖరిన్. 41

క. అనిమామక మానసమున । నను తాపముతోడఁ దలఁచి యక్కవలఁ జూలో
చనకుం దగిన నృపాలక । తనయుని వీక్షింప నధికతత్పరమతినై. 42

ఉ. కేరళ కొంకణ ద్రవిళ కేకయ కోసల లాట చోళ గాం
ధార కళింగముఖ్య జననాథవరేణ్యుల నెల్లఁ జూచి యీ
వారిధిమేదినీతల మవారణమై పరికించి వచ్చియుం
గోరిక పారమందక వికుంఠితచిత్తుఁడనైతి భూవరా! 43

గీ. వనిత నిట్టిరూపవతిఁ జేసి శంభుండు । తగినవరు నొనర్పఁ దలఁపఁడయ్యె
ముసలి వేల్పు గాన ముదిమదిదప్పెనో । సేయనేర్పు లేక చిక్కువడెనో. 44

వ. అని సంశయాకులితచిత్తుండనై యొక్కనాఁడు పెక్కుదేశంబు లరిగి నభోమార్గంబున వచ్చునెడ బహుకాలయాతాయాత ప్రయాసంబునం జరణతలంబులకు

దుర్బలత్వంబును గరుదంచలంబులకు నచంచలతయు నుదరంబునకుబుభుక్షా భరంబును గంఠప్రదేశంబునకు దాహావేశంబును భావంబునకుం జింతావిర్భావంబును బొడమిన వీనుల వినుకలిపోనుగుపడం గన్నులంజెన్నరులుగ్రమ్మ సకలేంద్రియంబులు నంతర్గతంబులయి మలమలమాడి విలవిలమను నెఱకలతో గగనపథంబు దప్పిపడునెడ నంధునకుదివ్యదృష్టిగలిగిన విధంబున నయాచితోపనతంబయినయీసహకారభూజంబు సంజీవనౌషధంబై యవతరించినం దదీయచ్ఛాయాశీతలవాత పోతంబుల ఖేదఁదేరి కనువిచ్చిచూచి యచ్చెరువునంది. 45

సీ. ధారాళమకరంద ధారాలహరిలోన నోడలిఖేదమువాయ నోలలాడి
పణ్ణాగ్రనిస్సరత్ఫల రసబిందువుల్ తృషదీఱంగఁడుపారం గ్రోలిక్రోలి
శీతలచ్ఛాయాసమేత వాతంబులు సోరఁగమ్మైమెఱుకలవిరియఁజేసి
కిసలయకుట్మలాకృతి చంచుపుటమునం జిత్రపక్షమ్ములచికురువాపి
యఖిలశాఖలం జంక్రమంబాచరించి । మోదముగజాతివారితో ముచ్చటాడి
ప్రథమశకునానుకూల్య సంపత్తినైన । దైవగతిఁగంటినేఁ బునర్జీవనంబు. 46

క. ఈమేలమావికతంబున । నాయలమటఁదీఱె జీవనంబిఁకకంటన్
నీయనుపమరూపముఁగని । తోయధిగంభీర మనసు దుంపుడుకుడిగెన్. 47

ఉ. అంకవుజింకలేనియమృతాంశునిఁజూచిన చందమయ్యె నీ
వంకభవత్స్వరూపరుచి వారిధురంబిది లేకయుండినం
బంకజసూతితత్సమ కుమారకుఁజేయఁగలేనిదుర్యశః
పంకమువాపుకోఁగలండెపాయక జన్మ సహస్రకోటులన్. 48

క. నీలావణ్యముఁజూచిన । త్రైలోక్యములోని కంజదళనేత్రలకున్
వాలాయము మకరాంకుని । వాలాయమునాటకున్నె వసుధాధీశా. 49

వ. అనిబహుప్రకారంబుల నారాజకీరంబు సారంబగుతపనసుత లావణ్యరసపూరంబునకు యోగ్యంబుగా నిజతనూసౌభాగ్యంబు నగ్గింపనప్పుడు వెడవిలుతుఁడబ్భరతకులతిలకు మానంబనుచేడిసమీను తనవలకులోనయ్యెనని చయ్యనఁదియ్యవిలంటి గవిసెనఁదివిచి నవశితముఖ పుంజశింజినీరావంబు రోదసీకుహరంబుఁబూరింప సారించినగట్టు బిట్టుచలించిచిత్తంబు తత్తరింపనాత్మగతంబున. 50

క. చిలుకలపలుకులు రసములు । చిలుకునుభువి నెట్టివారిచెవులకుఁజవులై

చిలుకలకొలికి ప్రసంగము । చిలుకప్రశంసించెనేని జెప్పఁగనేలా. 51

సీ. మనసారఁగలిగి యాఘనసారవాసన యధరామృతము గ్రోలనబ్బనొక్కొ
చేతులారంగ నాశీతాంశుముఖి గబ్బిగుబ్బలుఁగబళింపఁగూడునొక్కొ
కన్నులారంగ నాకలకంఠిసౌందర్య గరిమంబువీక్షింప దొరకునొక్కొ
వీనులారంగ నావికచతామరసాక్షి పలుకులాలింపంగఁ గలుగునొక్కొ
యకటయేరీతి నాదుకోరిక ఫలించు । నెట్టుదరియింతు నతిలజ్జనేమిసేతు
నెవ్విధంబున నిర్జింతునించువిలుతుఁ । బల్లవాధరి చూపులపాఁపులేక. 52

క. ఈరీతిని మదిచెదరిన । నారాచకుమారుఁ డాత్మనద్భుతపడిన
న్నూరింపవచ్చెఁగా కీ । కీరంబనిచింతయుడిగి కీలించెధృతిన్. 53

వ. ఇట్లువలరాచరాచవాని నారాచంబులకుం జిత్తంబుతత్తరింప మెఱమెచ్చులకేని
యు ధైర్యంబుగీలించి లుప్తమీనజలాశయంబు చందంబున నిర్నిద్రనిష్కంపనయ
న పద్మతనూభారుండై నృపకుమారుండు ముహూర్తమాత్రంబు చింతించిరా
చిలుకపలుకులం దనకునవకాశం బొసంగిన తెఱంగుదోఁచిన నిట్లనియె. 54

చ. పలుకులజాణవో చిలుకపంజరమందు వసింపఁజేసిస
త్ఫలములుదెచ్చిపెట్టి దినపద్ధతిమచ్చికఁ జేసినేర్పినం
బలికినపల్కులే తిరుగఁబల్కెడుచిల్కలులేవె నీవలెం
బలుకులఁదేనెలుట్టి పడఁబల్కవుగాక సదుత్తరంబుగన్. 55

క. సురచాపస్ఫురణంబుగఁ । బరువడినీపక్షరుచులు పర్వుటయెల్లం
బరికింపనీక్షణంబున । నురువడిహర్షాశ్రువర్ష మొదవుటకుఁజుమీ. 56

సీ. ఆపల్లవాధరి యధరసంగతమున దొరికెనోనీకు మాధుర్యగరిమ
యారాజబింబాస్య యాస్యసన్నిధిచేత నబ్బెనోనీకు నాహ్లాదమహిమ
యాకోకిలాలాప యాలాపకలనచేఁ జెందెనోనీకు విశేషఫణితి
యాసరోజదళాక్షి యక్షిసంసక్తిచేఁ గలిగెనోనీకు లోకైకవశత
నిన్నుఁబేర్కొన్నఁగనుఁగొన్ననిఖిలజనుల।దుర్దశలువాయుమాయునుదుఃఖసమితి
మున్నుజేసిన నాతపంబులుఫలించెఁ । జితత్రివర్ణగరుత్తేజ చిలుకరాజ. 57

ఉ. విందవుగాన నిన్నొకటివేడెద నాపలుకాదరింపునీ
విందెఱిఁగించినట్టి సకలేందునిభాస్య నిలింపకన్యపై

నిముసించుమర్త్యుఁడు దినేశసుతన్ వరియింప[illegible]
నందని మ్రాని పంటిపయి నాసలుసేయుటగాదెచూడఁగన్ 58

క. ఆమోహనాంగి పరిరం। భామృత పానైక సౌఖ్యమబ్బకయున్నన్
గామించి కన్నులారం। గోమలి లావణ్యరసము గ్రోలినఁజాలున్. 59

గీ. ఆచకోరాక్షి నిలువెల్లసాభిలాషఁ। దివిరివీక్షింపఁ గలిమికుందేటికొమ్ము
నెలఁతపలుకులు మారుగా నీదుపలుకు। కర్ణపర్వంబుగావిను కలిమెచాలు. 60

వ. అని యారాజవల్లభుండు దుర్లభమనోరథుండై యభావవిరక్తి మతంబులగు వృత్తాంతంబులఁదన్నుపశ్లోకించి యుత్కంఠాతిశయంబున షోడశమహాదానధురంధరంబైన కరపల్లవతలంబునం జరమాంగంబు నిమిరిన మనఃపల్లవంబు చిగురొత్తినం జదువులవులుఁగు కథాసుమోదయంబు నరయుచు నిట్లనియె. 61

[illegible] అమరకన్యకపొందు మర్త్యులకబ్బనేర్చునెయంచుఁజి
త్తమున నెంతయు సంశయింపకు దైవయోగమె కారణం
బమలరూపగుణాఢ్య యల్లదె యంతరిక్షము మీఁదిచం
ద్రమునకున్ భువిఁగల్వకెంతటి దవ్వు చూడు మహీపతీ. 62

గీ. దైవయోగంబదెట్లన్న ధారుణీశ। జలజదళనేత్ర రెండవ చంద్రరేఖ
ధరణితలమున రాజశేఖరుఁడవీవ। యింతకన్నను విధియోగమేది గలదు. 63

గీ. నాకమునసున్న దేవతానీకమెల్లఁ। జంద్రబింబాస్య పూర్వపక్షంబుచేసి
పిదపవారల ముఖచంద్రబింబములకు। నపరపక్షంబుచేసె నత్యద్భుతముగ. 64

చ. సొలసినయావిలాసవతి చూపున రూపునఁ జేటమాటలం
గలిగి భ్రమించి కట్టువడి కాఁకలఁ బొందుదు రెల్లవేల్పులున్
వలవడిఁబడ్డమీలవలె వాసన సంపఁగిఁజేరు షట్పదం
బులగతి గంటచప్పుడుకుఁబొంచి వసించు మెకాలకైవడిన్. 65

గీ. అతను సంతప్తుఁడయ్యె గోత్రారి యతివ। గోరువెచ్చని కుచములుగోరువేడ్క
మానవాధీశ యుష్ణముష్ణేనశీత। లమను నుడికారమెదనుదలంచియొకొ. 66

గీ. వేయుగరముల విభుపుత్రివిమలగాత్రి। నలవి[illegible]
వేయునేటికి నేటికి వేయునోళ్ళ। వానికైననువర్ణింపవశముగాదు. 67

క. పూవును దావియుఁగూడిన। కైవడి నప్పువ్వుబోఁడి [illegible]

నీవున్న నజుని సృజన । ప్రావీణ్య మగణ్యమగు ధరాతలనాధా! 68

చ. వనరుహనేత్రతోడుత నవశ్యము నిన్నిటఁగూర్చె నేని న
మ్మనసిజుఁడే ధనుర్ధరుఁడుమాధవుఁడే చెలికాఁడు వానికిన్
వనరుహనేత్రతోడుత నవశ్యము నిన్నిటఁగూర్పకుండినన్
మనసిజుఁడే ధనుర్ధరుఁడుమాధవుఁడే చెలికాఁడువానికిన్. 69

క. ఆపల్లవాధరికినా । కేపట్టున నెంచిచూడ నేకగ్రీవం
బీపనికి సంశయింపకు । నాపలుకే యతివపలుకు నరలోకేశా ! 70

ఉ. అంగననీకు నీవుమఱియంగనకుం దగుదిందుకన్యధా
సంగతమైనఁగన్గాన నసంగతమిర్వురఁగూర్ప నేర్పు నా
కుంగల దేతదర్థముసకుం బ్రతిపుట్టదు పుట్టె నేని య
య్యంగజుపాదపద్మముల యానకుమీఱుదు మీరుమాఱఁగన్. 71

వ. ఇట్లు పలుకున గోమ్మరాయభారి నమ్మిక మాటలం దేలించిన నాలించియారాజ
కుమార శేఖరుండు రాజకీరంబునుద్దేశించి యిట్లనియె. 72

క. చిలుకా నీపలుకులునల । కలకంతి శుభోక్తులొక్కొకైవడి నిజమా
తలపోసిచూడ నెప్పుడు । నలరుంబోఁడుల తలంపులతిచంచలముల్. 73

చ. వలపులు చంచలాలతలు వావులు పంకములోని కంబముల్
సొలపులు వాస్తసంగములు చూపులు శారదమేఘజాలముల్
మెలపుదలంచిచూడ మిడిమేలము మేలములింద్రజాలముల్
తలఁపులొయుత్తమాశ్వములు తామరసాక్షుల నమ్మవచ్చునే? 74

గీ. నీవకారణ బంధుతాన్వితుఁడవగుట। నిన్ను నమ్మంగవచ్చుఁబోనియమపరత
మాయచారులుగాన యేమార్గములను। రాజవదనల నమ్మంగరాదుసుమ్మి. 75

వ. అదియునుంగాక. 76

క. ఆతరళాక్షికి నీచే । నేతెఱఁగుననైనఁ గోరనింపొదవినఁ ద
న్మాయావిత చిత్తంబుల । లోతెఱుఁగుట యెట్లు దేవలోకమునీద్రుల్. 77

గీ. ల్లినపుత్రిల యాజ్ఞయధికరించి। వనిత యేతీరుగోరు నన్వరునిగాఁగ
... దన ... మనుపరంజితోడఁ। గూడునే రుక్మకారుండు గూర్పకున్న. 78

సీ. సొబగుఁదనమ్మున జాడఁజాలని కంతుఁడింతిఁ జేకూర్చునే యేర్చుఁగాక

పేరామసియువాని గారాపునెచ్చెలి చెలిఁజూడనిచ్చునె చెంతనైన
నొకపక్షమునఁజూడ నుబ్బరి చంద్రుండు సుందరిఁగూర్చుట సందియంబు
మలయమారుతమైన మెలఁతఁదెచ్చునటన్నఁ గనరాదదియును గాలిమాట
యిలపయింగల పలుగాకులెల్లఁగూడ। ఖోదిసేయంగఁబెరిగిన పులుగు తవర
లీపికంబులు చాలవేవిప్పనులకుఁ। జెలువఁగూర్చినమఱినీకె చెల్లుఁగాక. 79

ఉ. ప్రాణము ప్రాణమైపరగు భద్రమతంగజకుంభతుల్యక
ల్యాణపయోధరద్వయిలతాంగిని నన్నునుజోడుగూర్చి నా
ప్రాణముఁగాచి యందులకుఁ బ్రత్యుపకారము చేయరామి నీ
క్షోణిమహోపకారకులకుం దలవంపు ఘటింపుమెంతయున్. 80

క. అనవుడు రాజశుకంబా। మనుజేంద్రుని వాక్యసరణి మదికింపొదవన్
ననిచిన పులకలనీకెలు। మొనరెత్తఁగ నిశ్చితార్థముగ నిట్లనియెన్. ✓ 81

సీ. కలశపాథోరాశి వెలసినజాబిల్లి కులదీపకుండవై వెలసితీవు
మకుటవర్ధనులైన మనుజాధినాథులు పదములకెఱఁగంగ బ్రబలితీవు
ఏడుదీవులమేర యీధరాతలమెల్ల నేకపట్టణముగా నేలితీవు
భువనంబులీరేడు బూరితంబులుగాఁగ నిరతంబు కీర్తుల నించితీవు
ఇట్టినినుఁజూచి గారాపుఁబట్టిసేక। పద్మినీపద్మలోచన ప్రాణమైత్రుఁ
డింతగడచిన చోటికి నిచ్చునోటు। వేనవేలేండ్లు తపముగావించినైన. 82

క. మనసారఁబెంచి కన్యను। చెనఁటియగు కురూపిపాలుచేయక నీవం
టన తగు వరునికిచ్చిన। జననీజనకులకుఁ గడుపుచల్లనగాదే? 83

క. సుమనశ్శరుఁడిక్షుశరా। సముచే నిన్నెదిరి గెలువఁజాలక వడిమై
బామవిటుఁదొడిగి రమణీ। రమణీయకటాక్ష శరమురయమున జేయున్. 84

గీ. కుటిలకుంతలములు గలకోమలాంగి। కైవసంబయ్యెననియుండు భూవరేణ్య
కల్లలాడిన నావంటి కలుషిగలదె। నానృతాత్పాతకంపరంబనుట గాన. 85

వ. ఇవ్విధంబున గీరంబు నమ్మించినఁ జిత్తంబునంబ్రత్యయంబంది యారాజకుమారుం
డు బహుమానపురస్సరంబుగా నుపలాలనంబు సేయుచుశుకచంద్రా! నీరాకగో
రి మదీయదృక్చకోరంబులెదురెదురు చూచుచుండెడు నీవంటి యపూర్వస్నేహ
బాంధవుండు చిరకాలార్జిత తపఃఫలంబునంగాక సిద్ధించునే భవద్దర్శనంబు

సకలమనోదుఃఖంబులు నివర్తించి మీఁదట రాఁగల శుభోదయంబునకిదియె కా
రణంబు గావలని సౌహార్దంబును భవదీయ ముఖోదితంబులగు సుప్రసంగంబు
లను మరువకుండునది యచిరకాలంబునంబున రాగమనంబుగాఁ గలయదియని రా
చిలుక నెట్టకేనియు వీడ్కొలిపిన. 86

క. కామితసంసిద్ధియగుఁ । భూమీశ్వర నీకుననుచుఁ బునరుక్తులుగాఁ
బ్రేమంబునదీవించుచు । నామోహన రాజకీరమరిగె నరేంద్రా! 87

చ. చిలుక లతాంగి యొప్పిదముఁజెప్పిన మాటలు మాటిమాటికి
న్దలఁచుఁ దలంచి యచ్చెలువ దద్దయు ధ్యానముఁజేయుఁ జేసియు
న్నెలఁతుక నిల్చినట్లయిన నెమ్మదిఁ దగ్గఱఁజూచుఁజూచియు
న్నెలవునఁగాంతలేమి ధరణీవిభుఁడాత్మ దలంచియిట్లనున్. 88

సీ. కలికి యీరాచిలుక పలువని పేరంటమీయెలమావికి నేలవచ్చె
వచ్చుఁగాకేమి వాక్రుచ్చి యిచ్చటవిన నినసుతావర్ణనమ్మేలచేసె
జేయునుగాకేమి శృంగారమహిమ నయ్యింతికి నన్నేలయీడువెట్టెఁ
బెట్టునుగాకేమి పిట్టమాటలకునై మనసులోపల నేలమరులుఁగొంటి
నిట్టినేరీతి యొకో! నాహృదయమెల్ల । విపులసంతాపభరమున వేఁగఁదొడఁగెఁ
దోటతోటనఁబూవుఁ దేనెలుదొరుగుచాఫ । మించువిలుతుండువంచునోయె ఱుఁగ [రాదు.

ఉ. చిన్నిమొగంబులే నగవుఁ జెక్కులఁగ్రిక్కిఱిసియున్న గుబ్బలుఁ
సన్నపుఁ గౌనుగల్గు నవసారసగంధిని సారెసారెనా
కన్నులఁగట్టినట్టి యలకట్టడి బ్రహ్మ మెఱుంగుఁదీగఘా
తిన్నిమిషంబు నిల్పక యదృశ్యముగా నిటయేల చేసెనో. 90

సీ. కోకిలనికరంబు వాకట్టుకట్టనే కలికివేణీ ఘనాఘనముచేతఁ
బాలయు తెమ్మెరలకు బుద్ధిచెప్పించనే పొలఁతి రోమావళీభుజగిచేత
రోలంబ జాలంబు దూలిపోఁజేయనే మదిరాక్షి ఘ్రాణచంపకముచేత
తూలుసింగిణివిల్లు తునియలుసేయనే తరుణియూరుగజేంద్ర కరము చేత
సుందరీమణి యొసపరిచూపువలలఁ । దగులదివియింపనేర్చున ధ్వజముఁబట్టి
యహహామత్ప్రాణవల్లభయైనయట్టి । చెలువయంతట నంతట సొలసెనేని. 91

చ. అరవిరిదమ్మిచందమున నానన వాసన సోఁకుముట్టున

య్యరుణసుతానుతాధరసుధాఖ్య రసౌషధ సేవ సేయఁగా
దొరకినఁగాక మిన్నకయ తొమ్మిదవస్థలతోడి మన్మథ
జ్వరము శమించునే దివిజవైద్యుఁడు వైద్యము చేసె నేనియున్. 92

చ. చికిబికి వెండ్రుకల్ వలెను జిన్నచిగుళ్ళు చరింపఁ గోకిల
ప్రకటిత నాదముల్ భయదరావముగా సుమనోరజంబు ని
ప్పుకలుగఁ జూత మెంతయును భూతమువై ఖరి భీతిచేసె నే
డకటమహేంద్రజాలకలనాఢ్యుఁడుగా రతిరాయఁ డెన్నఁగన్. 93

ఉ. కందెనచాయ శృంగపృథుకంబులు ధూమమురీతి దేఁటులా
స్పందలిరాకు నిప్పుకలపైఁ బొరలించి గళన్మధూళికా
బిందుచయంబునం బదను వెట్టుచుఁ గమ్మనియంపకోలలే
యం దలకొన్నవాఁ డిదె సుమాస్త్రుఁడు మర్మములుచ్చిపాఱఁగన్. 94

ఉ. ఆయవనీశుఁ డీకరణి నంగభవానలబాధ్యమానుఁడై
హా యని వెచ్చనూర్చు నకటా యని దైవముఁ దూఱుఁ ఒచ్చవు
ల్గాయెడ నడ్డమైనఁ దనయమ్మిలిదూతయటంచుఁ గాయొ పం
డోయని కార్యపద్ధతుల నొయ్యన వేడును భ్రాంతచిత్తుఁడై. 95

గీ. రాజకిరణసమూహంబు రాకచూచి । కఱఁగి జలమయమగు చంద్రకాంతపీఠి
రాజుమైపోఁకియును నీరుగ్రమ్మకిపుడు। భుగభుగన ధూమరేఖలు వెగయఁజొచ్చె.

ఉ. ఆపృథివీమహేంద్రుఁడు నిజాంగములం బొగలావరింపఁ జం
ద్రోపలవేదిపైఁ బొరలు నుగ్రమనోజవిషాదవేదనా
ధూపితదేహుఁడై యసితతోయజమధ్యనిబద్ధవీచికా
వ్యాపకమండలుండయిన వాసరధూసరచంద్రుఁడో యనన్. 97

వ. ఇట్లు వినుకలి విరాలిం దల్లడిల్లి జాలిఁగొని యాలీఢ విరహదావానల దంద
హ్యమానమానసాంభోజుఁడై యారాజబిడౌజుండు బట్టబయటఁ బడిన మీనుకై
వడిఁ బొరలుచు నిదాఘసమయ జాజ్వల్యమాన మార్తాండచండకిరణ మండలీ
సంతాపిత కుండలీంద్రంబు రేవ నుస్సురనుచు వాగురావలయాన్తర్గతకురంగ
ముభంగి నలుదిక్కులఁ జూచుచుఁ బరమాత్మ ధ్యానానుసంధాన ధురంధరుండైన
మునిసింధురంబు చందంబున నిశ్చలుండైయున్న నప్పుడు శుకనికరముఖదళితగళితప

రిణతసహకార ఫలరసధారాళ ధారా ప్రవాహంబు పయింజిలికినం దదీయ ధారామార్గంబునం జిమ్మనగ్రోవిం జిమ్మిన చందంబునం జెనుమంట లెగయం బవన కంపిత కుసుమ మంజరీపుంజరంజిత కింజల్క సమాజంబు నెమ్మేని నెకఁ దాఁకి మధ్యమార్గంబున గుగ్గులు ధూపచూర్ణంబు కరణి బుసబుస రవులుకొని పొనుంగువడి వియోగానల శిఖాయోగంబునం గ్రాఁగుచు దావానలజ్వాలావలీఢంబైన మేరు భూధరంబు లీలఁ జూపట్టినయారాచపట్టిం గనుంగొని యాసన్నయై జింగి యాసన్నిహిత పరిచారజనులు శిశిరోపచారకలనాకౌతూహలకోలాహలాంతరంగితులై రంత. 98

సీ. వెలఁది నవ్వులచాయ వెలఁదివెన్నెలగాయఁ గపురంపుధూళిమైఁ గప్పె నొకఁడు
చెలువకౌఁగిటపాటి చెలువైనపన్నీట నొకఁడు సర్వాంగంబు లోలలార్చెఁ
బద్మాక్షిముఖసామ్య పద్మజాలంబుల నురివున నిండారసునిచె నొకఁడు
పల్లవాధరహస్త పల్లవంబులఁబోలు పల్లవంబులొకండు పాన్పుపఱచె
సాత్వికోదయవేళ నాసతికి నొడలఁ। దోఁచువెడజారు జెమరుబిందువులవంటి
లలితమకరంద బిందువుల్ చిలికె నొకఁడు। డంగనాపన్మథునకుఁ బ్రత్యంగకముల.

వ. ఆసమయంబున నృపకుమారుండు తదీయబింబ ప్రతిబింబ వస్తుకదంబ శిశిరోపచార వాసనా విశేషంబునం గొంతశమియించి సావశేషంబైన విరహానల దోషంబు వహించి యెట్టకేలకుం బట్టణంబుఁ బ్రవేశించెనంత. 100

శా. హిందూరాయసభాళి సత్కవిమణీ బృందావన ప్రక్రియా
మందారద్రుమ విద్రుమాధర సుధామాధుర్యధుర్యాంగనా
కందర్ప ప్రతిమాన మానుషకళా గాండీవకోదండ స్వ
చ్ఛందీభూత కృపాసముద్ర యవనక్ష్మామండలాఖండలా. 101

క. బాహాబలసీరాయుధ। సాహసగుణవిక్రమార్క సంగరరిపుకో
లాహల కరణస్ఫురణ కు। తూహలరస గోలకొండ దుర్గాధ్యక్షా. 102

భుజంగప్రయాతము. కనత్కీర్తిజానిక్షేప కల్యాణరూపా
దినాధీశ తేజః ప్రదీప ప్రతాపా
ఘనౌదార్య కానీన కాంతిప్రదానా
మనోభూసమానా రమాభాసమానా. 103

గద్య. ఇది శ్రీమద్గురు కృపా విశేషలబ్ధసార సారస్వతపవిత్ర విలసద్దంకి
వీరయామాత్యపుత్ర సరస గుణసాంద్ర గంగాధర కవీంద్ర
ప్రణీతంబైన తపతీ సంవరణోపాఖ్యానంబను
శృంగార కావ్యంబునందు
ద్వితీయాశ్వాసము.



# తపతీ సంవరణోపాఖ్యానము.

## తృతీయాశ్వాసము.

శ్రీయువతికరధృతాబ్జసు। మాయితబుధవర్ణనీయ మహితచరిత్రా
ఛాయాభిరామ భువనమ। హీయశ్శ్రీసాంద్ర మలికియిభరామేంద్రా! 1
వ. అవధరింపు మగ్గజపురాధివల్లభుండాత్మగతంబున. 2
గీ. రాజకీరంబుకతమున రాజవదన। భావమస్మదాగమన సంప్రవణమైనఁ
దల్లిదండ్రుల యాజ్ఞయధఃకరింప। నేరకుండుటమనమున నిశ్చయించి. 3
చ. ఉదయమువేళ శారదకు నుబ్బానరించి దినార్ధమందుబె
ట్టిదమగు వేఁడిచూపునిగుడించి దివాంతమునంబరోధినె
మ్మదిఁ బవళింపఁబోవు రుచిమంతుఁ ద్రిమూర్తిమయస్వరూపునిన్
జెదరని భక్తియుక్తిని భజించెదనాతనికన్యఁ జెందఁగన్. 4
వ. ఆరాజశేఖరుండిట్లుసూర్యోపాస్తివిస్తీర్ణమనస్కుండగుచు నిజవృద్ధామాత్య
పురోహిత హితజనంబులరావించి వారలకుం దనదుమనంబునంగల వృత్తాంతం
బంతయు నెఱింగించి తదనుజ్ఞాతుండై. 5
శా. నాళీకాప్తుఁడు గోరగించునట మున్ప్రత్యూషకాలంబునన్
వాలాయంబుగ ఫుల్లతామరసభవ్యంబైన శృంగారపుం
గేళాకూళిని దీర్ఘమాడె యనురక్తిన్ ధాతకాషాయుఁడై
ఫాలాదిస్థలులందు నవ్యభసిత ప్రాగల్భ్యమేపారఁగన్. 6
క. అర్ధోదయావసరమున। వార్ధిగభీరుండు సంధ్యవార్చెను దిమిరాం
తర్ధవళతారకాళీ। స్పర్ధాళిశిరోరుహాగ్ర జలకణయుతుఁడై. 7
క. రుద్రాక్షలు ధరియించెను। ముద్రినిషంగాంగమాంగ మోహనముద్రా

భద్రాసనస్థుఁడాతఁడు । భద్రవ్రతకల్పకమ్రఫలముం బోలెన్. 8

ఉ. ఆనడబావిదండఁ గలయంజిగిరించిన దేవదారుశా
ఖానికరంబు క్రిందట నొకానొకచోఁ గురువిందతీవపూఁ
బానుపుటింటిలోన వనపాలుర కెవ్వరికిన్సుసుంగఁగా
రానిప్రదేశమందున ధరాధిపుఁడొంటి సమాధి నిష్ఠుఁడై. 9

సీ. పదియాఱువన్నియ బంగారుమేనితోఁ గమనీయమాయూరకాంతితోడ
మకరకుండలకర్ణమండనంబులతోడ రాణించుతారహారములతోడ
నవరత్నఖచితాభి నవకిరీటముతోడఁ గరమొప్పు శంఖచక్రములతోడఁ
జెలువందు నరవింద సింహాసనముతోడ దయదొలుకాడు నేత్రములతోడ
సవితృమండల మధ్యమస్థానుఁడగుచు। మించు నారాయణుఁదలంచె మేదినీశుఁ
డంతరంగంబు నిశ్చలంబగుచునుండఁ। బవనవిరహిత నిభృతదీపంబుపగిది. 10

క. ఆయిందువంశతిలకుఁడు । గాయత్రీమంత్రజప వికస్వరమతితోఁ
బాయక యారవిమూర్తికి । నాయతమతిఁ జేసె నంతరంగపుఁబూజల్. 11

సీ. ఆవాహనమొనర్చె నరుణున కాసనంబిచ్చె హేళికిఁ బాద్యమిడియె రవికిఁ
దరణికర్ఘ్యములిచ్చెఁ దపనునకొసఁగె నాచమనీయ మాదిత్యుజలక మార్చెఁ
బటువంతుఁ జేసెరుక్పతి నర్కునుపవీతుఁ గావించె ద్యుమణికి గంధమలఁదెఁ
బూషునక్షతములఁ బువ్వులఁబూజించెఁ బద్మమిత్రునకు ధూపముఘటించె
దీపమొనరించె మందేహతాపనునకుఁ। గలితనైవేద్యమర్పించె గగనమణికి
నమరఁ గల్పించెఁ దాంబూలమర్యమునకు। నల్లునిగఁ గూర్పుమని వేఁడె నబ్జసఖుని.

గీ. విరహభరమున నరపతివివశుఁడగుచు। వేదజనయిత్రిగాయత్రి వెసఁబఠించు
నిశ్చలంబుగఁ దలపోయు నీరజాప్తు। సుఖముదుఃఖంబు కార్యార్థి చూడఁడెందు.

మ. నయమొప్పం బదునాఱుమార్గములఁ డెందం బందు నర్చించి భ
క్తియథోక్తంబుగ సావధానమున మూర్తిధ్యానముం జేయుచో
నయతేజోనిధి నిల్చినట్లయిన బ్రహ్మానంద సౌఖ్యంబునన్
జయమార్తాండసరోజినీరమణహంసా యంచువాచార్భటిన్. 14

వ. వెండియు నిట్లని స్తుతియించె. 15

తోటకవృత్తము. జయలోకవిలోకన చండకరా। జయభక్తజనావన సాధుమతీ

జయదీధితి పుంఖితచక్రధరా। జయదివ్యమహాపరిషద్భవనా! 16

తరళ. దినమణీరమణీయవిగ్రహదీప్త కుండలితగ్రహా
కనకభూధరయామికోత్తమ కంజవైరిసుహృత్తమా
సనకముఖ్యమునీంద్రపూజిత సప్తవాహవిరాజితా
వనజినీ విధురవ్యపోహన ద్వాదశాంగక మోహనా! 17

పంచచామరము. అనంతసప్తసంఖ్యసాగరాంతరాత్తభూమిలం
ఘనాతిజాంఘికత్వలాల గద్ధరిత్తురంగమా
ఘనప్రతాపనిశ్చయ ప్రగల్భకుంభికుంభలుం
ఠనక్రతుప్రశస్తకర్మతత్ప్రభావ కేసరీ! 18

వ. అని యిట్లు సజల జలధరధ్వాన గంభీర వాగ్గుంభనంబుల నభినుతించి యంభో
జబాంధవు ననుదినంబు నారాధించుచు హవిరశనుండై దర్భాస్తరణవిస్తీర్ణత
ల్పశయుండగుచు మహానియమంబునఁ జరియించుచుండియుఁ బ్రజాపరిపాలనం
బునఁ జాగరూకుండయ్యుండఁ జండకరుండు నిజాంతరంగంబునం బ్రసన్నుండై
కన్యాప్రదాన కౌతూహలంబునకు బద్ధకంకణుండయ్యెనంత. 19

గీ. మేఘమార్గమెక్కి మేరుశైలముదాటి। మింటివాగునొరసి మిగుల మెఱసి
తరతరంబ యొత్తిఁగి తపతీలతాతన్వి। చేతిమీఁదవ్రాలెఁజిలుకరాజు. 20

క. వచ్చినపచ్చని పులుగుక। మచ్చికమీఱంగఁజూచి మణిబంధముపై
నచ్చుగనిడె ముద్దాడుచు। నచ్చంచలనేత్రపలికె నాదరమొప్పన్. 21

గీ. సేమమేనీకు ముద్దులచిన్నిచిలుక। యెందుఁబోయితివో కదా యిన్నినాళ్లు
జీవపదమైన ననుబాసి సేమగాని। సేమజరియింపఁదగునలే రామతమ్మ. 22

మ. అవె నీచుట్టపుఁ జిలుకపింఛ్లైదురుగా నన్యోన్యమే తెంచె న
ల్లవె నీతోడిసతీర్థ్యశారికలు సఖ్యంబెంతయుం దెల్పుచు
న్నవి శోకప్రమదోష్ణశీతఘన బాష్పాంబు ప్రవాహంబులన్
భవదంతఃకరణంబు మమ్మునకటా పాయంగ నెట్లుండెనో. 23

గీ. అనినఁదనమీఁదిప్రేమబంధనముచూచి। మోదభయభక్తులాత్మలో ముమ్మరింప
వందనాలింగనాదుల వారిఁగూర్చి। చిలుక యానందరసములుచిలుకఁబలికె. 24

క. కమలవనీబాంధవునకు। నమరావతిలోనఁ దగినయల్లుఁడు లేమిక్

గ్రిమమున ధరణీతలమున। నెమకంగా దొరకకుండు నేయనుబుద్ధిన్. 25

చ. అరిగితి నాసముద్రవలయావనిఁ గూర్చి తదంతరంబునం
దిరిగితిఁ బెక్కుదేశములు ద్రిమ్మరితిన్ బహుపట్టణావళుల్
వరుసఁ బసిండికొండ వలవంకను నేరెడుదీవిలోపలం
గరిపుర మేలుచున్న మహికాంతుని రాచకుమారుఁ గాంచితిన్. 26

గీ. అతనిరూపంబు గనుఁగొన్న యబ్జముఖులు। కడఁక నీతని వరియించు కన్య ధన్య
యనుచుఁ దమలోన వరియింప నవ్విభునకు। సంవరణనామధేయంబు సఫలమయ్యె.

సీ. ఆసంవరణురూపమరసి జయంతుండు నివ్వెఱఁగంది నిర్నిమిషుఁడయ్యె
నారాకుమారుని యాకారమీక్షించి వెలవెలఁబాఱె నాకలువతేఁడు
అక్కుంభినీజాని చక్కఁదనముఁ జూచి విగ్రహంబుడిగెఁ బూవింటివాఁడు
ఆవార్ధిగంభీరు లావణ్యమును గాంచి నలకూబరుఁడు చాల నలుకఁ బూనె
నహహ యీరేడులోకంబులందుఁ గలుగు। సకలలావణ్యరసమెల్ల సంగ్రహించి
గరిమ నారాజుఁ గావింపఁ గరువుగట్టి। చేసెఁ గాఁబోలు నేర్పుతో సృష్టికర్త. 28

క. బంగరునఁ దావియమరిన। భంగిం జెలువునను బండుపండినలీలన్
శృంగారవంతుఁడగున। య్యంగభవస్పర్ధిమేన యౌవనమొదవెన్. 29

ఉ. మానవపత్తుఁడైక యజమానుని రూపము ప్రాపుఁ గాంచి య
మ్మా! నవయౌవనోదయ మహావిభవంబది యేమిచెప్పుదున్
మానిత మేఖలాగుణము మానవలోక వధూజనావళీ
మానముఁ గాఁచెఁ గాక వెలి మైనిలుపోపునె నీవిబంధముల్? 30

గీ. క్షితిని సతులెల్ల నతని వీక్షింపఁ గోరి। చిత్రఫలకాళి వ్రాతురు చెలువుమెఱసి
చిత్రరూపాళి కవ్విభు చెలువులోన। నూటవెయ్యింటనొక్కపాలౌట యరిదె. 31

క. ఆచతురత యాచెలువం। బాచల్లదనంబు నాఘనౌదార్యకళా
వైచిత్రియు ధరణింగల। రాచకుమారులకుఁ గలదె రాకేందుముఖీ. 32

చ. పలుకులు వేయు నేమిటికిఁ బంకరుహాయతచారునేత్ర యిం
పులను జగద్వశీకరణ మోహన దోహలరూపరేఖలన్
వలనుగ నీకు నీడనఁగవచ్చును భారతవంశరత్నమున్
జలజనిభాస్య యాతనికి సాటిదలంపఁగ నీవ చూడఁగన్. 33

వ. అని మఱియు మంతనంపుం బలుకులుం గలవనిన నలికతలమునఁ జెమట దొలు
కరింపఁ జంగవ కెలంకులఁ బులకలెగయఁ దలంపున ననురాగంబు పల్లవింప నచ్చి
లుకలకొలికి రాచిలుకతో నిట్లనియె. 34

మ. శుకమా! కోకనదచ్ఛవిచ్ఛురిత చంచుశ్రీపరాభూతకిం
శుకమా! నీకును రాకుమారునకు నెచ్చో నందె సందర్శనం
బకలంకాత్ముఁ డతండు నీచరితమే మైనన్ విమర్శింప మా
మక వృత్తాంతమెఱుంగఁ జెప్పవుగదా మన్నించుచో నచ్చటన్? 35

క. చెప్పినవేమియవునొగద । యప్పార్థివ నందనునకు నర్హమగు సతిన్
జెప్పెడిచో మము ముందఱఁ। జెప్పగనుండంగవలదు చెలిమికి నయినన్. 36

క. బంగారువంటి మేనును। శృంగారము గురియు మోముజిగియును గల రా
సింగముతో నన్నొనయని। సాంగత్యమొనర్ప నీకు సంగతియగునే. 37

వ. ఇట్లు నిరహంకార పురస్సరంబులైన తపతీవచనంబులు విని గంభీరతాసంభిన్న
బహిరంగవర్తనంబును బల్లవితాంతరంగంబును దెలిసి రాజకీరం బిట్లనియె.

క. నీరూపం బెఱుఁగవుగా। కేరూపసినైన నీకు నెనవచ్చునఁటే
వారాశి రాజకన్యా। గౌరీ రమణ శతమన్యకాంతలలోనన్. 39

శా. ఆసంపన్నవతంసుఁడా వినయకారుణ్యౌదార్య ధౌరేయుఁడా
రాసింగంబు కాక యంత మెచ్చఁడు మదిన్ రంభోర్వశీముఖ్యభా
మాసౌభాగ్యమునట్టి రాకొమరుఁడస్మద్వాక్యవిస్మేయుఁడై
నీసౌభాగ్యము విన్నయంత మదనాంధీభూతుఁడయ్యెన్ వెసన్. 40

క. వినుకలి కనుకలి లోపల। వినుకలియే మిగుల మదనవేదన జేయున్
వినుకలి వలపులఁ గాదా। ననువుగ మఱి మరులుకొనిరి నలదమయంతుల్. 41

గీ. అనెడు చిలుకపలుకు లాలించి యాలించి। ధరణిపాలురూపుఁ దలఁచి తలఁచి
పంచబాణబాణపంచకంబెదనాటఁ। దపతియగుచు నపుడు తపతి పలికె. 42

క. గురుదక్షిణభారంబున। గురుదక్షిణ మున్నెయీయఁ గోరితి విపుడా
వరదక్షిణయిమ్మదియే। వరదక్షిణ మాకు మదనవాహావతంసా. 43

వ. అని యిట్లు ప్రార్థించిన దండప్రణామంబాచరించి రాచిలుక యారాచమొలక
యున్న పట్టణంబునకుం జని ఫలితకార్యంబుని వేదించి నిజస్థానంబునకరిగెనంత.

చ. వెడవెడనార్చిమన్మథుఁడు బిట్టుగఁ జక్కెరవింటిదండమున్
గుడుసువడంగఁ జేసి విరిగ్రొవ్విరితూఁపులు తేఁటిశింజినిన్
బొడముచుఁ బింజపింజఁగను మొల్లసుగంధి పయిందనంతనే
కడువడినాటినట్లమరెఁ గంతుని కౌశలమేమిచెప్పఁగన్. 45

సీ. జివ్వనఁబఱతెంచు చెంగల్వబాణంబు దట్టంపుఁదుమురు నిట్టట్టు చేసె
నరవిరిప్రాయంపు టరవిందసాయకం బలికభాగమునాటి యల్లలాడెఁ
గ్రొవ్వాఁడికంకేలి కుసుమనారాచంబు గండదర్పణసీమ గండుకొనియె
నవనవపరిఫుల్ల నవమాలికాస్త్రంబు కుచకుంభసీమను గ్రుచ్చిపాఱెఁ
జిలుకుమకరందములమావి చిలుకు ములికి। కలికిచిలుకలకొలికి వక్షంబుదూరె
నేనుబాణంబులీరీతి నినుమడింప। దశమగతికొంతదోఁచె నత్తరుణిమేన. 46

చ. రహిఁగలపుష్పసారభకరంభము లెవ్వరికైన సొమ్మటే
యహిమమయూఖపుత్రి సుమనోనుభవంబు నెఱుంగదండమే
యహహ! విరాలిగొన్నజవరాలికి వైరములయ్యెఁబుష్పముల్
సహజమె, దుఃఖితే మనసి సర్వమసహ్యమటన్న పల్కులన్. 47

ఉ. అయ్యెడనేటువడ్డ హరిణాంగనకైవడి విన్నబోవుచున్
దొయ్యలి వెచ్చనూర్చి పటితోషముదక్కి తమోగృహంబుదా
నొయ్యనఁజేరనేగ యట నొంటిని జెక్కిటఁ జేయిచేర్చియ
య్యయ్యొ విషాదమై పొరలు శయ్యపయిం బలుమాఱు వేదనన్. 48

క. రాచిల్క ప్రసంగించిన। రాచకుమారకుని యొరపు రమణిదలఁచుచున్
లోచనగోచరుఁగాఁగని। యాచంచలనేత్ర లోఁగునతిశయలజ్జన్. 49

గీ. అతివదృష్టికిఁ దెఱచాటు ప్రతిమరీతి। మెఱపుమెఱసిన కరణినామెచ్చులాఁడు
చూడఁజూడ నదృశ్య విస్ఫురణఁదాల్చు। నంత నారామయెడఁదనిట్లనితలంచు. 50

సీ. ననుగూర్చివచ్చిన ఘనునిలాలింపక సఖియరో నేనేల చట్టునైతిఁ
గడుదూరమే తెంచి బడలినరాసుతు హత్తి పాదములేల యొత్తనైతి
సంతోషకరముగా జనపతికేలకో మించుఁజూపులు నివాళించనైతి
నెదురొత్తుగుబ్బల నెదురొత్తియాతనికిఱుఁగౌఁగిలేలొకో మఱపనైతిఁ
గొంతవడదీఱఁ జూరలుకొలఁదిగాఁగ। గూర్మినధరామృతంబేల గ్రోల్పనైతి

నన్నువలగొన్న కర్మబంధంబుకతనఁ। గొంగుబంగారు కటకటా క్రోలుపోతి. 51

ఉ. చిక్కనిమోము మేలిమగు చెక్కులు చొక్కపుహారవల్లిచే
నెక్కొను పేరురంబు రమణీయ విశాల విలోచనంబులు
న్జక్కగమించు రాసుతుఁడు నాదుకవుంగిటఁ గాపురంబునం
జిక్కిన నేలనే? మకరచిహ్నమువాని వతారుపట్టుగన్. 52

ఆ. నిమిషమాత్రమైన నేత్రంబులారాజు। సొబగుఁదనముచూడ సొంపుమీఱ
నతనిపలుకువీనులాలింపఁగోరెదు । నెట్లుదీర్తు వీనిఋణముదివిరి. 53

వ. అనిబహుప్రకారంబుల నాలోచనలు సేయుచుఁ గనుంగవకెలంకులం బైపైఁ దొ
ఱఁగు కన్నీరుసోనలు నదీప్రవాహంబుగా నంతకంతకు లావణ్యరసపూరంబు వె
ల్లివిరియ నారాచ కుమారుని గుణకథనంబులు కోటలు కొండలుగాఁ దలంచుచు
జలరాశిచందమ్మున నవ్విలాసినిఁ గనుపట్టె నయ్యవసరంబునందొయ్యొలి నెయ్యం
పుఁజెలులు యువతిజనచూడారత్నంబుఁగానక నిర్విణ్ణలగుచునేతెంచి. 54

సీ. ఫులఖండములఁబెట్టి చిలుకతండములను జదివించునెలవులు వెదకివెదకి
నవమాలికాచూత నవసంగమోత్సవ సముచితస్థలములు నెమకినెమకి
తమ్మిపుప్పొడిదిన్నె దళముగావించిన గురువెంద పొదరిండ్ల నరసియరసి
నవరత్నమయమైన భువనేశ్వరంబులోఁ జుట్టుబవంతులు చూచిచూచి
ప్రేమబంగారుబొమ్మల పెండ్లిసేయు। నవరసంబగు ముత్యాలచవికెదండ
కందుఋను జేరియచట రాయంచవలన। యువతిజనరత్నమున్న కందువమెఱిఁగి

ఉ. చెక్కునహస్తము న్నిటలసీమనుఘర్మజలంబుచూపునన్
జొక్కపుఁగీలుకొప్పును గనుంగవక్రేవలవేఁడియశ్రులుం
జెక్కువచింత నెమ్మనిని మేలిమిరాజకుమారవర్యుపై
మక్కువయుం జెలంగు నలమంజులభాషిణిఁగాంచి రాసఖుల్. 56

క. పొదలెడిరూపుననున్నత। పదవినివసియించు మనుజపతిఁజేరుటకై
మదికోర్కుల దొంతరలిడు। మదవతిఁగని పలికిరిట్లు మహిళాజనముల్. 57

సీ. ఏలమ్మ నీకింతహృదయ తాపముసెందె నెంతయునీయుసిక్కివింతదోఁచె
జనువుననీమాట జవదాటమేకదా యక్లైనమమ్ముల నాదరింపు
తల్లిదండ్రుల ఘమత్వము డీలుపడియెనో యెన్నఁడులేని నీకేలచింత

కళ్యాణికలేమి దప్పెనరించెఁ జదివింపవేటికి జలజగంధి
పలుకుదో డైన పసిఁడి విపంచిఁబాయఁ । గారణంబేమి చెప్పుమా కంబుకంఠి
నీబహిఃప్రాణములమైన నెచ్చెలులము। మాకుదాఁచంగ నేలమ్మ మధురవాణి. 58

శా. ఓకాంతామణి నీవు నెమ్మనములోనూహించు నేకార్యమున్
మాకుం దెల్పకయుండ విల్లురవుగా మమ్మాత్మ భావింతురే
రాకాచంద్రనిభాస్య కాఁకఁబడి హేరాళంపునిట్టూర్పుతో
నేకాంతంబునఁ గుంద నేమిటికి నీయిష్టంబెఱింగింపవే. 59

మ. అని నెయ్యంపు సఖీజనుల్ పలుకఁగా నంతర్గతాత్మప్రియా
జనముం దెల్పెదఁగాక యంచుమదినుత్సాహించు లజ్జాభరం
బునశంకించు నెఱుంగఁజెప్పకునికిం బోనియ్యరే తెల్పనే
మనిభావింతురొకో వయస్యలని డోలాందోళితస్వాంతయై. 60

క. ఎఱిఁగింపని బాలికఁగని । యెఱిఁగించుకొనందలంచునింతులఁగని య
త్తెఱవల నెల్లను బొమ్మని। యొరిమెను సడిసన్న బోటియొకతుకవలికెన్. 61

ఉ. మొల్లసుగంధి నీతలఁపు ముందఱగా నెఱుఁగంగవచ్చె నీ
యుల్లముఁ గొల్లలాడి మఱి యొల్లమిచేసిన జాణఁడెవ్వఁడో
మెల్లనవానిడగ్గఱి సమేలపుమాటలువల్లెవేసి నీ
యుల్లసితాంఘ్రిపద్మములకొప్పన చేసెద నేల చింతిలన్. 62

గీ. అనుడుమనమునఁగలకంఠిహాసమంది। చెలియగడునాదరించి రాచిలుకపలుకు
తనదువృత్తాంతమంతయు ననువుపడఁగ। బూసగ్రుచ్చినరీతిఁజెప్పటయునపుడు.

క. లలనా యింతటిపనికై। కలఁగంగా నేల నీదు కనుసన్నలనే
మెలఁగంజేసెద నవ్విభు। తిలకునిగని యీరాడించి తెచ్చినయంతన్. 64

క. దరహసితభాసి నళినీ। తరుణీవదనారవింద దర్శనరతిమే
నరమఱచి చూకిలినగతిం। జరమదిశాభాగమునకు సవితృఁడుపాఁకెన్. 65

ఉ. పంకజబాంధవుండు తనపై దినలక్ష్మి వసంతకేళిమైఁ
గుంకుమపంకతోయములఁ గొంకకచల్లిన దొప్పదోఁగిగా
రాంకసలక్ష్యమాణవపురంబరుఁడై యిటఁబశ్చిమాబ్ధిలోఁ
గ్రుంకఁగ నేఁగెడున్ జరమగోత్ర మహాశిఖరాగ్రవర్తియై. 66

గీ. క్షితినిలింపకరాంభోజ కీలితార్ఘ్యుఁ । డారిలోఁదోఁగి పద్మినీవల్లభుండు
ప్రబలమందేహరాజిపై బ్రహ్మశరము । లేయుఁడీవేళ యని వారిజాయకరణి. 67

గీ. కటికాకారావతంసుఁడై కాలగళుఁడు । సంజకడఁ దాండవంబాడ జడలవలన
వెడలియుప్పొంగు గంగ గోళ్లడియనంగ । సరవిఁదపనుండు పశ్చిమజలధిఁ గ్రుంకె.

క. అంతటహరిదంతంబుల । సంతమసముఘురియ రవియు జలధిఁబడెనో సా
/ మంతులుపద్రవులు గూడిన । నెంతటిబలవంతుఁడైన నెదురంగలఁడే. 69

మ. ముకుళీభావముఁ జెందియున్న సకలాంభోజాత సంవృత్తకో
రకసందోహశిఖాగ్రసీమల నళివ్రాతంబుగన్పట్టె వా
ధకసంధ్యావనపాలబాలిక తమిస్రాభూతభూమీరుహ
ప్రకరంబుం బ్రబలింపవిత్తిడిన సౌభాగ్యంబు చెన్నొందఁగన్. 70

సీ. చటులతాండవనటన్నిటలనేత్రునియందె పలుకులఁగలిమించెఁ బక్షిరవము
భ్రమణలాస్యవిశీర్ణ భవజటాపటలంబుగతి సంజకెంజాయ గానుపించె
నుద్ధానసమయసముద్యదీశ్వర గాంగజలకణచ్ఛాయఁ జుక్కలు చెలంగె
నటనటీగోద్గీర్ణపటుగర్భనేత్రాగ్ని కణములోయన దీపకళికలెసఁగెఁ
గహకహారావభిన్నదిక్తటము గాఁగ । నట్టహాసంబుతో నాట్యమాడుహరుని
కంఠకాకోలరుచులుపైఁగప్పినట్లు । బెట్టిదంబుగఁ జీఁకటిపిక్కటిల్లె. 71

క. కాటుకబరణివిధంబున । హాటకగర్భాండమమర నతిగాఢతమః
కూటములుచూచి యనుఁగుం । బోటులతోఁబలికిరిట్లు ముగుదలు ప్రీతిన్. 72

సీ. దీనిఁజిప్పలఁబెట్టి తెలుఁగెఱుంగము గాక వసనంబులకు నీలరసము గాదె
దీనిఁగరాటాలఁబూననేరము గాక తలఁపఁగన్నులకుఁ గజ్జలము గాదె
✓ దీనిగుచ్ఛములుగా దీర్పనేరము గాక నవరాలుగావె కైశ్యంబులకును
దీనినిదైలంబుఁ దివియనోపము గాక రతిరేఖలకు మషీరసము గాదె
యనఁగ నెమ్మొగమడఁచినఁ గనుగొనంగ । రానిదట్టంపుఁజీఁకటిరాసిఁగవియ
నిరులుసరియయ్యె వలతులెసిమరులుదలరెఁ । దమకమటుహెచ్చఁ గడుజారదంపతు (లకు. 73

ఉ. కన్నులఁగజ్జలంబునిడి కస్తురిపంకము నిండఁబూఁతగా
జెన్నుగఁబూసి నల్లనగు చేలముగట్టి కపోలపత్రవ
ల్లి నెరవొప్పఁదీర్చి యువలీల విలాసినులన్ విటవ్రజం

బున్న రహస్యభూములకు నొయ్యనఁజేర్చిరి తాపికత్తియల్. 75
వ. అయ్యవసరంబున. 76
సీ. అంధకారంబను గంధవారణముపైఁ గుప్పించుసింగంపుఁ గొదమయనఁగ
శచికిఁగైసేసిన శయ్యాగృహంబుపై నెలవుకొల్పిన సుధాకలశమనఁగ
లాచిపాంథులమీఁద ల్లావణివేసిన యలరువిల్తుని సంకుటరిగెయనఁగఁ
బ్రాచీదిశాకాంత పత్రికఁ గానుకగాఁగఁ బన్నిన కపురంపుగిన్నెయనఁగ
గగనగంగాతరంగిణీ కమలషండ । మందువిహరింపఁబోవురాయంచయనఁగ
మహితనవషోడశకళాసమగ్రుఁడగుచుఁ। దూర్పుగుబ్బలిపైఁదోఁచెఁదుహినకరుఁడు.
గీ. ఇంతదడవును యామినీకాంతఁబాసి । రమణగూడినమదినను రాగరసము
పట్టుచాలక పైవెల్లి పాఱెననఁగ । నుదయరాగంబుశశిమేననుదయమయ్యె. 78
సీ. ఆశావధూటుల నాలింగనముచేసి సరసజీవంజీవసమితిఁదన్పి
యిందీవరశ్రేణి నెకటటినవ్వించి సారసావళికళఁజారఁజేసి
మహినభోమధ్యమాంబరమును గబళించి యాకాశగంగలోనఁగిపెనఁగి
వలిజకకవలయందు వలవంతఘటియించి బ్రహ్మాండకోటిఁజుంబనమొనర్చి
హావభావవిలాసవిఖ్యాతివిటుల। సతులవలపించువైఖరిసంఘటిల్లఁ
బూర్ణరాకానిశాకరోద్భూతశీత। కరములఖిలజనాహ్లాదకరములయ్యె. 79
శా. ఆకాశంబనుభూరుహాంతరమునందత్యచ్ఛగుచ్ఛక్రియన్
రాకేందుండమరం దదంగగతచిహ్నంబంతఁజూపట్టెభృం
గాకారంబున గంధవాహవశనిర్యత్సూనరేణుచ్ఛటా
నీకాశంబన నావరింపఁదొడఁగె న్రేయెండ బ్రహ్మాండమున్. 80
చ. ఘనవితతస్ఫురత్పదవిఁ గైకొని రాజుతమఃకదంబకం
బను కుజనవ్రజంబుఁదెగటార్చిదిశాచయ సాధుమండలం
బానర వెలుంగఁజేసె నది యుక్తమెకాదె నృపాలధర్మవ
ర్తనునకు శిష్ట దుష్ట పరిరక్షణ శిక్షణ దక్షణ క్రియల్. 81
సీ. కిలకిలారవములకీరయూథమనువైతాళికావళిచేతమేలుకాంచి
జలదమార్గాంబునఁ జాలఁగఁబ్రవహించు నిండురేయెండఁ గైదండఁబూని
చంద్రికాంత్రిస్రవచ్చంద్రకాంతంబుల తెలినీటలోచనాంచలముఁదుడిచి

రసములొలుకుచునుండు రతిదేవికెమ్మోవి సారెసారెకుఁ దప్పిదీరఁగ్రోలి
మలయపవనరథంబెక్కి మన్మథుండు । సకలసన్నాహములతోడ సంభ్రమించి
దాడివెడలె నభోమరుత్పటల నిహతి । మినుటెక్కెలంబు థళథళ మింటమెఱయ. 83

వ. అంత.

సీ. అంభోజసంభవ గంభీరతాసరోవర గంధనాగ హెచ్చరికయయ్య
ప్రమథవల్లభ తపోబలసింధు మంథాన ధారుణీధర యవధారుజియ్య
నాకలోకాధీశ నాయకత్వాంబుదానిక జంఝూకపరాకు సామి
పరతత్వ నిధ్యానపటు పరాశరమౌని దీపిత చిత్తైక దేవదేవ సు।
నిరతిశయ నిత్యనిజధర్మనీతనియత । సర్వసర్వంసహాధీశ సార్వభౌమ
అభవవిక్రతి కరీరఘురామవసాన । జలదగజాళప్రతీకాశ జయరతీశ. 84

వ. అని కీరశారికానీకంబులు మాగధప్రకారంబున రథపురోభాగంబున మన్మథుని
కీర్తిప్రతాపంబులు కైవారంబులు సేయు సమయంబున. 85

క. కాలాంధకారపటలముఁ । దోలి విజృంభించె విశ్వతోవ్యక్తములై
నీలంనభయను మాటకుఁ । జాలఁగ బాధకములయ్యె శశికిరణంబుల్. 86

క. రాకాపూర్ణ నిశాకరుఁ । డాకమలహిత ప్రసూతకత్యుష్ణండై
భీకరముగఁ గనుపట్టినఁ । గైకొని దూషించె నతివ కలువలఱేనిన్. 87

చ. అమృతమయస్వరూపుఁ డనయంబును సత్పథవర్తి చంద్రశే
బ్దము నన్నృతంబు జేయఁ డొకపట్టుననంచు జనుల్ నుతింపనో
హిమకర యా ప్రశంస మఱిమెన్నక మిన్నక పీటఁబుచ్చియీ
క్రమమునఁ బాంథసంఘములఁ గాఁకల నేఁచఁగ నీకుఁ బాడియే. 88

ఉ. ఓరజనీశ హాలహలసోదర ! యీక్రియ విస్ఫులింగముల్
క్రూరతఁ గుప్పళించు నతిఘోర శిఖాచయ సాంద్రచంద్రికా
సారముఁ గ్రోలికాదె యనిశంబు చకోరకదంబకంబు లం
గారకణంబులం గమిచి క్రక్కుచునున్న దిప్పుడున్. 89

సీ. కడఁకతో రాహువు కబళించి పట్టుచో నీపౌరుషంబప్డు చూపవలదె
వీరభద్రుఁడు నిన్నుఁ బెనవెట్టి మట్టుచో నీలావులప్పుడేమూలకొదిగె
ఘనకుహూడాసి నీకళలెల్ల మ్రింగుచో నిర్మూలమయ్యెనే నీబలంబు

కోపించి దక్షుండు శాపంబొసంగుచో నీశక్తి యుష్ణ దేనీటఁగలసె
చలువ వేఁడని ఫూత్కారసమితిచేత । శమము గాక్షించు మముఁబోటి జనులమీఁద
నిబ్బరంబుగ వేఁడివెన్నెలలు గాసి । గాసిచేయంగ నేటికిఁ గమలవైరి. 90

సీ. త్రిపురసంహృతివేళఁ ద్రిణయనంబులయందుఁ గోపాగ్నిహరుఁడు గీల్కొలుపఁబోలు
నుదయవల్మీకాహి వదనవిషాగ్నులు వెసఁబికకూటిలి వెలివిసరఁబోలుఁ
బొడుపు గుబ్బలిమీఁదఁ బాటమరించినయగ్గి సెగసంజకెంజాయఁ దగులఁబోలుఁ
బ్రతిదిన వ్యాయామ భరవశంబునఁ జేసి నేఁడు పాదంబులాష్టింపఁబోలుఁ
గాక యీచాయఁ జిచ్చులు గ్రమ్మఁజేయు । కటికి రేయెండ యామినీకాముకునకుఁ
బుట్టఁగాఁబుట్టినది వైనభూమిలోనఁ । బధికసందోహమున కెల్లఁ బ్రదుకు గలదె.

గీ. నిరతసురతశ్రమము వాయ గిరిజయలుకఁ । జెఱుతఁగావింపశిరసుఁగైసేయఁజూచి
మూఁడుమెచ్చులుమెచ్చి శంభుండు నీకుఁ । గరుణనిచ్చె నెహిమధామచురుకుఁజూపు.

ఉ. నింగి భువిన్ దరవుల్కొనుచు నీకిరణంబులు ప్రజ్వలించుటన్
బొంగులువాఱు పాల్కడలిపో యెఱిఁగించుచునున్నదోయి సా
రంగధరా నినుంగువలయప్రియుఁడైన కుమారుఁగాంచి యు
ప్పొంగెడు దుగ్ధవార్ధియని భూజనులాడుట యర్థవాదముల్. 93

క. తనతోఁబుట్టినదగుమా । నినియింటికి కీడుదలఁచు నిర్దయుఁడగు నీ
వనజారి యితరవనితా । జనతాఘన తాపమునకు శంకించునఁటే. 94

వ. అని బహుప్రకారంబుల నయ్యోషాలలామంబు దోషాకరునిదూషించి యతనిం
బురికొలిపిన యతనునింగుఱించి యుపాలంభన సహితంబుగా నిట్లనియె. 95

సీ. చిగురాకుఁగైదువుఁ జేరిభక్షించుచోఁ గోయిలలను నేలకోయవైతి
తూపుసింగిణివిల్లు దొరకొని మెసఁగుచోఁ జిలుకముకుఱుల నేలచీరవైతి
పూవుఁదూపులమీఁది పూఁదేనెఁ గ్రోలుచో నేల తేఁటులఁబడనేయవైతి
మొగలిరేకుకటారిమొన తావిగబళించు తెమ్మెర నేవేల చిమ్మవైతి
అయ్యుభియ్యులు వెట్టి నిన్ననుదినంబు । నేముసేవింపఁ గరుణింపవింతయైన
వెఱచి పఱచిన నశరీరి వెంటనంటు । ననెడువార్త నిజంబయ్యె నంగసూతి. 96

ఉ. వేడుకతోడ నీకుఁ బదివేలవిధంబులఁ బూజలీయఁగా
నోడక సేయఁగాఁ దొడఁగితోలి నరిష్టమె చంద్రమౌళిచే

మూపవకంటసేయగుటమున్నె యెఱుంగఁగనైతి నక్కటా
బూడిదెలోని హోమమయిపోయెనదంతయు భావసంభవా ! 97

గీ. రతిమనోహర నినువలరాయఁడంచుఁ । బ్రజలుపేర్కొన విననదకోపడకచోర
విన్ననది మేలయుండునో వెన్నుదీక । సూనరసనిర్ఝరంబులజుణిగిపోక. 98

ఉ. తెంపుననీకుఁదోడగుచుఁ దేఁటులఝుంకృతిచేసి మన్మనః
కంపముఁజేసెనయ్యొ రతికాముక నీవిశిఖప్రసూధను
స్సంపదకాత్మనెట్లయిన సైఁపదు నామనవాలకింపవే
సంపెఁగతూపులేదొడిగి చక్కెరవింటను నేయలేవుగా. 99

వ. అనుచునీచందంబునఁగందర్పునిదూఱి శరీరబంధనంబునకుఁబాశంబులు తనకుఁదానె తెచ్చుకొన్నకైవడి నతనుంబెడ రేచిచంపకసాయకంబులనేటువడి షట్పదప్రమదయుంబోలె నవమావస్థఁగైకొనియవ్విరహిణి శయ్యాతలంబుపైనొఱిగెనంత.

గీ. చెలువకొకబోఁటి కర్పూరతిలకమిడఁగ । నుదురుసోఁకినమాత్రనే యెదురులయ్యెఁ
బ్రాణసఖులెల్లనచ్చెరుపడిరియంత । నసమబాణునిగుండియలావలింప. 101

మ. చివురుం దామరపాకులన్ సలలితశ్రీఖండపంకంబులన్
నవనీహారజలాభిషేచనములన్ నాళీకపాళీమృణా
ళవితానంబుల మౌక్తికగ్రధితమాల్యశ్రేణులన్ బాలప
ల్లవతల్పంబుల శీతలక్రియలు చాలంజేసిరయ్యింతికిన్. 102

క. శీతోపచారములనా । శాతోదరి ముచ్చముణిఁగి సంతాపముచే
నాతతమిహికావర్ష । ప్రాతఃకాలికవిపన్న పద్మినిఁబోలెన్. 103

వ. అయ్యవసరంబున. 104

గీ. అత్రిమునికంటిపసిబిడ్డఁడాకసమున । నుడుకణములాడకాడకునుద్దవిడిన
బాలభానునినలుఁగడ బఱువుమీఱు । వెండిగుండన నుదయించె వేఁగుఁజుక్క. 105

సీ. కలఁగిచీఁకటులెల్ల నిలువఁదావులులేక పాతాళబిలములోపల నడంగెఁ
గుక్కుటనిర్ఘోషకోలాహలముచేత లీలఁబద్మములెల్ల మేలుకాంచెఁ
బ్రాభాతకోత్పన్న పవనకందళములు వెదచల్లెనఝుఁగడ విరులతావి
తమకంబురెట్టింపఁ దలలెత్తివీక్షించె గమిగూడి చక్రవాకంబులెల్ల
నరుణుఁడుదయించె నెలసంజయంకురించెఁ । గుముదములుస్రుక్కెకిరణముల్గ్లాన్నిసెక్కె

గొప్పపవడంపు దీఁగెపూఁగత్తివోలె । సుదయగిరిమీఁదఁగనుపట్టెను పుష్కరుఁడు.

శా. పన్నాళీవిజయాపురీనగర కల్బర్గీ సుదుర్గాసన
చ్ఛిన్నశ్రీకలవాయిదత్త విచలచ్చేతోమరుద్వేగరిం
ఖన్నానావిధఖత్తలాణఘనరింఖాపుంఖ సంఘట్టన
చ్ఛిన్నక్షుణ్ణదిగంతశైలచతురా సింహాసనాధీశ్వరా. 107

క. పౌనఃపునసప్తమాధియ । మన్నియనృపమండలీ సమర్పితరత్నా
చ్ఛన్నసుహృద్విపరదని । భిన్నాధఃపతితరామరిపుగిరి నిచయా. 108

మానిని. కులకుధరసుధీరా క్షోణిరక్షావిహారా
చలితవిమతవీరా శౌర్యసంపత్కుమారా
కలుషహరణశీలా కల్పకత్యాగలోలా
తెలుఁగుదళవిభాలా దివ్యతేజోవిశాలా. 109

గద్య. ఇది శ్రీమద్గురుకృపావిశేషలబ్ధ సార సారస్వతపవిత్ర విలసదద్దంకి వీరయామాత్యపుత్త్ర సరసగుణసాంద్ర గంగాధరకవీంద్ర ప్రణీతంబైన తపతీసంవరణోపాఖ్యానంబను శృంగారకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.





తపతీసంవరణోపాఖ్యానము.

చతుర్థాశ్వాసము.

క. శ్రీతులిత విభవకృష్ణా । గౌతమిసరిదంతరాళ ఘనచతురంతా
శీతగిరిదుర్గభరితమ । హీతలదేవేంద్ర మలికియిభరామేంద్రా.
వ. అవధరింపుము. 2
ఉ. ఆరవి కూర్మిపుత్రి మనసారవిశేషవినోదలీలలన్
ధారుణిఁగాలయాపన మొనర్పుదమంచు వయస్యలెల్లరున్
వారిజగంధిఁదోడుకొని వచ్చిరి దివ్యపదావతీర్ణలై
తారలు చంద్రరేఖయని ధాత్రిజనుల్ పరికించుచుండఁగన్. 3
ఉ. అంతవసుంధరంగల వనావళిఁదోరణగట్టెభుగ్నహే
మంతము సుప్రసాదరుచిమంతము సంతతపాంథలోకహృ
చ్చింతము మానినీజనవిశేషదురంతము దర్పితాఖిల
స్వాంతము దీప్తిమంతము వసంతము గంధతరంగవంతమై. 4
మ. మలయక్ష్మాసరమందునుండి మెదలన్ మందానిలాంకూరముల్
నలువొందఁజిగురొత్తె భూజములు కందర్పాస్త్రశాలాకృతిన్
గలయంబూచె నశోకవృక్షములు భృంగవ్రాతజీవాతువుల్
పలుమాఱున్ భుజమప్పళింపఁదొడఁగెం బంచాస్త్రుఁడుద్యుక్తుఁడై. 5
క. భృంగధ్వనిమంత్రంబుల । రంగద్ద్రుమయాజకోత్కరము నవదళవ
హ్నింగుసుమ రసాలముచే । నంగజుపట్టాభిషేకహవనముచేసెన్. 6
ఉ. పల్లవగుచ్ఛకచ్ఛవులు బంగరుపింజె తెఱంగుమించఁగాఁ
జల్లనిమందమారుత వశంబునఁబుప్పొడిఁగ్రోయుఁగ్రొవ్విరుల్

బల్లిదమొప్ప మానినులపైఁ గడునాగ్రహమెత్తి యంగభూ
భల్లచయంబుకోపమునఁబావకకీలలు గ్రక్కనోయనన్. 7

ఉ. కేలివనాంతరాళమునఁ గేసరసూనసరన్మరందముల్
గ్రోలివిటీవిటుల్ శిశిరకుంజములందు వసంతవేళకున్
? బాళిమెత్తింగి కిన్నరులు బంగరువీణెలు మేళవించి హిం
దోళమొనర్చి పాడిరి మనోభవ దిగ్విజయాంకగీతముల్. 8

క. మరుదంకురములు వాలసీన । సారదింజలియించు చిగురుజొంపములవరెన్
విరహులగుండియలవియం । బరువడిరుఝళిపించుమరుని పట్టసములనన్. 9

ఉ. ముప్పదిరెండుకైదువుల మోహనలీలను మార్చిమన్మథుం
డెప్పుడుఁ బాంధసంఘములనేచి హుటాహుటి వేటలాడఁగాఁ
దప్పకభామినుల్ మఱచి తప్పియుఁ బాయరు ప్రాణనాథులన్
ముప్పిరిఁగొన్నమోహమున మోమెఱసేయరు వారువారలన్. 10

వ. అయ్యవసరంబున రసాలకిసలయవిరసగ్రసనోత్కంఠకషాయ కంఠ కలకంఠి
కాకుంతకుహూకార కాకుకాకలీకోలాహలధ్వాన బధిరితపథికజనసహస్రంబుల
గువసంతఘస్రంబులేతెంచిన మలయమారుతవ్యాజంబున వనదేవతలు వసంతం
బులాడందలంచి కుసుమపరాగంబు వెదచల్లినఁ దత్ప్రతీకారంబుగా మకరందరసం
బులు చిందుచు నరవిరి నెత్తవు నెత్తమ్మిబిమ్మనగ్రోవింబూఁజేసెసోనలు చిమ్మంద
లంచిన నల్లికతీవజొంపంబులుశింజినులుగా బిగువున వలయాకారంబులైన పుం
డ్రేక్షుదండంబులనెడి యుండవింట్లఁ దదీయరంధ్రనిర్ముక్తముక్తాఫలంబులందతుక
హారమార్గణంబులు గట్టసేయుచు నెచ్చెలులరీతిం బచ్చని వల్లీమతల్లులు పల్లవహ
స్తంబులన చతురకుసుమగుచ్ఛంబు లందందనంది యిచ్చునెపంబునఁ జరింప నవ్వ
సంతోత్సవంబు చూడనేతెంచినవారలు చల్లినకుంకుమజలంబులందొప్పదోగినఖా
తకుసుమితకింశుకద్రుమంబులు జేవురింపఁ దదవలోకనంబున ముసిముసి నవ్వులు
నవ్వుకైవడిం బొండుమల్లియలు పుష్పితంబులై తనర నవచంపక ప్రసవంబులను
బంగరుబుఱ్ఱటకొమ్ములశుకముఖదళితగళితసహకారఫలరసంబులు చిందినంబట్టి వె
దవల్లంబూనినంబఱచునవమాలికా బాలికల జారిన చికురభారంబుపోలికఁ జంచ
రీకసంచయంబులుతూల నవ్వాయస్యాజనంబులు నచ్చండాస్యయుంగుసుమాపచ

యవినోదసమ్మోదమేదుర హృదయారవిందంబులతోఁ బ్రవర్తించిరంత.

సీ. కలహంసలేలకో యెలదోఁటకరుదెంచెఁ ? గావవి మందంపుగతులుగాని
తిమిరంబులేలకో దివమందెపొడకట్టెఁ ? గావవి కేశపక్షములుగాని
యచలంబులేలకో యల్లలాడదొడంగెఁ ? గావవి మెఱుఁగుఁజన్గవలుగాని
కొమ్మింపలేలకో కొమరారెమధువేళఁ ? గావవి శితకటాక్షములుగాని
యొలమినెలవీఁగలేలకో మెలఁగదొడఁగెఁ । గావవిసురాంగనాజనాంగములుగాని
యనుచునితరులుతముఁగొనియాడసతులు। మిగులఁగుసుమాపచయకేళిఁదగిలిరపుడు.

గీ. పుష్పలావంబుగావించుపోలఁతులకును। సరసములుఁ కాలయాపనాసహములయ్యె
మదనతంత్రప్రవణలైన మదవతులకుఁ । గొసరుమాటలు వలపులకుసురుగావె.

ఉ. ఇమ్ములఁబల్లవాఢ్యమగు నీవిటపంబునుజూచిమాటతి
య్యమ్మునలంచితోసఖియ యప్పుడెకానఁగవచ్చి నీవిధం
బమ్మకచెల్ల ప్రాణసఖులారడె బెట్టైదరిట్టుచూచినం
గొమ్మకువచ్చెఁగొమ్మయని గొల్లున నవ్వుచుఁగేలిసేయుచున్. 14

గీ. కోయఁగోయంగసహకారగుచ్ఛకములు । మొలవకుండవురావణుతలలమాడ్కిఁ
బూవుప్రాయంగఁదునుమకపోదుసకియ । రామయనుపేరుదీనికహర్ణంబుగాదె.

ఉ. చూతనటంచుడగ్గఱిన చూతమున్నిన్నిటనంతచేసెనే
పోతరమెత్తియున్న యలిపోతరవంబులఁజీరి పంపుచుం
భీతియొకింతలేక తమిఁబల్చెను బల్లవహస్తసంజ్ఞఁగా
మాతురవృత్తినున్న నిఁకనన్యులపాపమెమంజుభాషిణీ ! 16

గీ. మధుపరాగయుతాశోకమహీరుహంబు । కంటకితశాఖముంగురులంటఁబట్టి
చిఱుతశాఖలగబళించెఁ జెలువమోవి । తనదుచిగురునఁగబళించెఁదరుణికంటె.

సీ. ముత్యాలజల్లితో మురువుచూపఁగఁజాలు మొల్లజొంపములు క్రొమ్ముడినమర్చి
నాసికాలంకారభాసమానంబుగాఁ బొన్నలమొగ్గలఁబొందుపఱచి
దంతంపుఁగమ్మల ధాళుచూపఁగనోపు సేవంతిక్రొవ్విరుల్ చెవులఁబూని
మధుపాననిభృతబంభరకర్ణికారంబు తుమ్మెదపదకంబు దొరయఁదాల్చి
కల్పవృక్షపరంపరాకల్పమాన । భవ్యనవరత్నమయమహాభరణభరణ
కలితశృంగారములకన్నఁ జెలువుగలిగి। సురసతులువాల్చిరొకవింతసొంపుతోడ.

క. పెనుపొందు జఘన కుచకచ । ఘనభారంబులకుఁదోడు గంపలకొలఁదిఙ్
నసొమ్ములు మెయిఁదాలిచి । పనివడి బయలీదిరపుడు భామినులెల్లన్. 19

గీ. చిలుపఁజిలుపఁ జెమటచెక్కుల జారఁగ । నలఁతవాడమి యూర్పులగ్గలింప
మందకేలిసలిపి మారుతార్థినులయి । వచ్చిరివనిఁ దిరిగి వనితలపుడు. 20

సీ. మధుపసంగతిఁగూడిమాడి నిద్రింపఁగాఁ గనుకఁబద్మిని కోపగించెననఁగ
మధ్యందినంబున మదనారి మూర్తిమై తెగువమూఁడవకన్ను తెఱచెననఁగ
రవికాంతములయందురవులుకొన్న హుతాశి ప్రతిఫలింపఁగనైన బలిమియనఁగఁ
గుముదినీవిధుల మక్కువ లెడలించుచేతనఁబెట్టుపెనుమంట దాఁకెననఁగ
వలవుతోఁబూవులకుఁబరవములు గెంట । సతులయవతంసములఘర్మజలములంటఁ
దొగలనెయ్యంపుఁజెలికానితోడిజంట । బంటుగాఁజూచె నడుమింటబడుగుకంట.

గీ. తోడిలతలెల్ల విరులచేఁదొంగలింప । నొక్కజాజియె ఖిన్నమైయున్న యట్లు
తోడిచెలులెల్ల యుపవన క్రీడసలుపఁ । దపతిచింతవహించి సంతాపమడరె.

వ. ఇవ్విధంబున విహార విలాసినీజనులు నిబిడముఖ మారుత ప్రేరితంబులైన పయోధరంబులు పెంజెమట సోనవానలు గురియ, వాహినులైన రోమరాజి ముక్తాలతాకపట కళింద నందనీ సురధునీప్రవాహమార్గంబుల నాభీసముద్రగామినులైన జలవిహార శారదారంభంబున నిక్కింపందలంచి వికచకమల కల్హారప్రచయ నిష్యంద మకరంద బిందుధారాళ ధారాలహరీ కూలంకషంబైనకొలనుఁ బ్రవేశించి రొమ్ములబంటినీటనిల్చి యచ్చెలువ విరహసముద్రలంఘనంబునకుఁ గట్టినసేతుబంధంబనఁ జనుగొండలు పోలికంజాలు గట్టుకొని చూపట్టు బంధురతాంధకారసంబంధ ధమ్మిల్లసందోహంబులు కబంధపానానుసంధాన నీరంధ్ర నీలకంధరంబులై విరియఁబృథులబిసవిసరంబులను చిమ్మనగ్రోవులఁ బయఃపూరంబు చిమ్ముచు సామిఫుల్లతామరసంబులను బుఱటాకొమ్ములఁ గింజల్కసహిత పంకజమరందంబను కుంకుమజలంబునఁ దొప్పదోఁగుచు నొకరొకరికి బాసటమైెకవిసివేసటలేక మార్కొను సమయంబున నన్యోన్యవక్షోజభారంబులఁగొట్టువడిన సలిలపూరంబు కలహాయమానమహోత్తుద్వ్యయమధ్యంబునఁ దత్తరించువత్సంబులాగునంబఱవ నవకాశంబులేక యల్లలాడఁబైకొనివచ్చు నుద్దిముద్దరాలింగని కతలంబున సలిలపూరంబప్పళించు పుష్పాళ్లుపైపైఁగుప్పళించుచుఁ జెఱువునీరు

వరంబువడయుటకు మాఱు కాపరంబువడసి తేనెయని యూరడించుచువలలకులో
నుఁగాకుండ మీలపిల్లలకింతలు గఱపనొఱపరులైన విధంబునవిలోకనంబులు దీనికిం
జౌకళింపఁదొడంగెనని పరిహసించుచుఁ గమలాకర లక్ష్మియు నీరుపాపలంగూడి
క్రీడించుజాడఁ జామరతంపరలైన విహారంబుల వినోదించి కేళీసరోవరంబు వెడ
లి చతుర్విధాలంకారంబులువధరించి యొక్క మాధవీమంటపంబునఁ జంద్రికాంత
శిలాతలప్రదేశంబున. 23

సీ. వేఁడుక నెలదమ్మితూఁడుసంబము లెత్తి కలువ రేకుల బోదెలలవరించి
పరువంపువిరులచప్పరము చాఁపగఁ బన్ని మొగలిరేకులదళ్లు బిగియఁగట్టి
పస్నీటఁ గులికిన పైగోవ జవ్వాది కపురంపుటరుఁగు పైఁగవయనలఁది
మొల్లపూమొగ్గల ముగ్గునిగ్గుగఁ బెట్టి మల్లెపూవులఁ బాలవెల్లిగట్టి
చెఱకువిలుపూవుటమ్ములు చెంతనిలిపి । పడఁతులప్పుడు చెంగల్వపాన్పుమీఁద
ననలవిలుకాని నావాహనంబొనర్చి । పూజలొనరించి వినుతింపఁబూనిరపుడు.

శా. కాంచీవప్రనితంబ దుర్గనగరీ కళ్యాణ సింహాసనో
దంచన్నిత్య నివాస దుర్గమయ కోదండ ధ్వనజ్జ్యాలతా
కించిట్టంకృతి కింకరీకృత మహాగీర్వాణ మూర్ధన్యదో
శ్చంచత్పల్లవ ఖడ్గనిర్దళిత కంజాతాసన స్వాంతయో
పంచాస్త్రాయని మ్రొక్కి యమ్మదవతుల్ ఫాలస్థ హస్తాబ్జలై. 25

సీ. కుసుమ కోమలిమీఁదఁ గోపింపఁ జెల్లునే పోషింపఁ దగుఁగాక పుష్పబాణ
మీనాక్షిపైనింత మెఱమెఱ సేతువే చేరిమీనాంక రక్షింతుగాక
పక్షీకరింపక రూక్షింపనేటికి కీరభాషిణిమీఁదఁ గీరవాహ
యలివేణిమీఁద బిట్టలుగనేటికినింత తూలిశిలీముఖజ్యాలతాంగ
యబలఁగావంగదయ్యా యోయనంగసూతి । రమణిమన్నింపుమయ్యా యోరతికళత్ర
యింతిగరుణింపుమయ్యా యోహృద్యరూప। మెలఁతరక్షింపుమయ్యా లక్ష్మీకుమార.

వ. ఈక్రమంబున వలపుల రాయనిం దద్బలంబుల నారాధించుచుండె నంతకమున్న
సంవరుణుండు సూర్యోదయావసరంబున వేఁటవెడల నుత్సహించి. 27

శా. ఆజానేయ హయంబు (నెక్కి తమితో నాభూమిపాలుం) డు ధా
త్రీజాను ప్రభవానుయాతుఁడయి ద్వాత్రింశన్నిశాతాస్త్రుఁడై

వాజిప్రాణ సమాన సత్పరిజనుల్ పార్శ్వంబులన్ మూఁగిరా
రాజత్తేజము తోడఁ దా వెడలె శూరశ్రేష్ఠుఁ డత్యుద్ధతిన్. 28

క. క్రమమున వెనుకొని రవుతును । సమకట్టులజల్లులమరసజ్జోగముతో
చమరీ మృగము * * * నెక్కియ * * * రుదెంచి రొగిన్.

సీ. మఱియు సింగమునైన మార్కొని యొక్కకోలఁ బడనేయువారై ఖరిబరిఢవించి
గజమధ్యముల (నొక్కకత్తి వ్రేటునఁ దుండెములు సే) యు హస్తకౌశలము గలిగి
పిడెములనేకోలు బెబ్బులితండంబు సమయించు పెనుసాహసమున మించి
పఱచు జింకలనైనఁ బ (టురయంబునఁ బాఱి మసలక ప) ట్టు దీమసము దాల్చి
తెవ్రులకొంకైనగుంకైనఁ ద్రెళ్ళియున్న । నడవి మెకములరొప్పనియట్టి భటులు
వెండికట్టులవిండ్లు (బసిండిపూఁత । యలుఁగులొప్పారన) రుదెంచి రధిపుకడకు. 30

సీ. బంగారుగొలుసులఁ బట్టినిల్పఁగరాని జవసత్వములు గలజాగిలములు ✓
నెమిలినిఘాతనినదంబు * * * సివంగిబండ్లు ✓
నుడ్డీనగమననీడోద్భవంబులఁ బట్టి డిగ్గనను కించు డేగపౌఁజు ✓
కనుకట్టు మైనుండి ఖచరపక్షులచప్పు డాలించి సైఁపని జాలికదుపు ✓ ?
మఱియుఁ దఱికొన్నయా ఖేటమార్గమునకు । వలయుసాధనములుగొనివచ్చి రపుడు
హాయమునడపించున్నృపతిసమక్షమునకు (నశనిసంకాశులగు మృగయాభిరతులు).

ఉ. వచ్చినలుబ్ధకప్రముఖవర్గము సన్నహనంబు గాంచి యా
తెచ్చినసాధనంబులను చేరికనుంగొని రాజు మెచ్చి పెక్
మచ్చిక నాదరించె నిల మానవనాధులు భృత్యకోటికిన్
మెచ్చులొసంగఁగావలదె మేలిమికార్యముఖాంతరంబునన్? ✓ 32

వ. ఆసమయంబునఁ బాదరసంబు వైఖరిం ద్రొక్కినచోటు ద్రొక్కక సారంగంబు భంగి నాకాశంబునం దఱుచు గాఁ బఱచు సుడిగాడ్పు చందంబునఁ గేడెంబు దిరుగుచు మనంబు విధంబునం బనిచినయెడకు నరుగుచున్న మరుత్తురంగ బాంధవంబైన ధవళ సైంధవంబును యథేచ్ఛంబుగా నడిపించి నిదాఘసమయోష్ణంబుల భ్రాంతిం గ్రూరసత్వంబుల సమయించువాఁడై వనమహిషవిషాణకోటి తాడనంబులఁ జంచరించు ఘనమహీరుహ విటపాగ్రంబులనిద్రించి బిట్టులికిపడి మేల్కని శాఖావలంబులై మధుమక్షికా పరిక్షిప్త క్షౌద్రపటలంబుల వ్రేలాడు భల్లూకనికరంబును

భీకరసూకరంబుల తెకోమలంబులైన మోరలంజాతుర్యంబు మెఱయ నిమిషంబు నవలయాకారంబులుగా ధరణీ విచారణంబొనరింప నవియగాథంబులైన యో దంబులుగాఁ దలంచిభయపడి లంఘంబులిచ్చు మాడ్కి-మందు వేసవినాటి వేసటలే కుండగండస్రవన్మదజలాసారంబులఁ గాసారంబులునిర్మించుభద్రమాతంగయూ థంబును విశాల తలాతల విశ్రాంతగవయధేను పయోధరంబులవిసి కురిసినం గాలువలుగట్టి జాలువారు వావిరిపరిపూర్ణంబైనపరతల్పంబులపాలుద్రావంగ లిగి యీనినపులుల బారికిందప్పి ప్రతిదినప్రవర్ధమానంబులై యామకవిసియు న్న శార్దూలజాలంబులుం గలిగి పిశునజనప్రధానంబైన రాజాస్థానంబురీతి నమ్మహాగహనంబు దురవగాహంబైయుండె ధనుర్ధరులు వేటకాండ్రంబురి కొల్పి యసహాయశూరుండైన యారాకుమారుండు వేటాకర్కుప్రదేశంబునకుఁ బ్రవేశించువాఁడై కశాఘాతంబునం దురగంబునకుం జుఱుకుఁబుట్టించి. 33

క. హేషారవంబుతోడనె । భీషణమైదిక్కులదురవఁబృధివీరమణీ
భూషణము హయారోహణ । నైషధుఁడత్రఁడెంచిసింహనాదముచేసెన్. 34

సీ. అపుడంతరంగంబునందుఁ గొందలమంది పొదరిండ్లుదూఱు బెబ్బులికులంబు
లొండొంటిఁ గూడక గుండియల్ ఝల్లనఁ గలగుండు వడిపాఱు గండకములు
ఘీంకారములతోనఁ గసగొట్టి గట్టులగగ్గులుకాడిన గజఘటలును
పఱవఁజాలక చౌటిపత్తియలలో నీఁగి నేలవట్టినయట్టి కోలచయము
గలిగికలఁగి యల్లకల్లోలమై చూడఁ । బిట్టపిడుగువంటి బెట్టిదంపు
బొబ్బవిన్నమాత్ర భూకంపమైనట్లు । కళవళించె సకలకాననంబు. 35

క. అయ్యెడఁజెదరిన మెకముల । కొయ్యన వింట్లెక్కు-వెట్టి యోధులుచుట్టుం
జయ్యనవలగొని వానిని । వ్రయ్యలుగావించి రంపవానలచేతన్. 36

సీ. అవెయంత పొద్దునీవదను పట్టులనుండి కదలేఁ బిల్లలపందికదుపువరుస
లివె గుండెపఱుకులో నిరవుచేసుకయుండి తిండికేగెడుఁబసిదిండిపోతు
లవె మందగొఱియల యపమృత్యువులఁ జూడు బెంకులవిడని తోడేళ్ళచాలు
లివె గాలిఁగదలు బొంగు వెదుళ్ళరవళికిఁ జిక్కి-నిల్కు-డగొను జింకమంద
లనుచు వానితావులరసి యాటవికులు । చుట్టుముట్టఁగువారి చూపువేట
మెకము కులమునెల్ల నొకవాగుసీరుద్రా । వించిరేమిచెప్ప వేటసొంపు. 37

క. అప్పుడు సింగిణి వింటం । జప్పుడుగాకుండఁ దొడిగి జనపతి శరముల్
తెప్పలుగ నేసి మెకములు । కుప్పలుగాఁబడఁగఁ గెడపెఁ గుంభిని మీఁదన్. 38
సీ. శరభసంఘంబెల్ల శరభగ్నమైకూలె గండకంబుల పిండు గండడంగె
సింగంబులకు సంగరంగంబు చూపట్టె మదగజంబులు సదమదములయ్యె
బెబ్బులితండంబు పట్టుపించములయ్యె సలుగులపాలయ్యె నెలుఁగులెల్ల
మహిషపుంజంబులు మహీతలంబునఁ ద్రెళ్ళెఁ గోలజాలము పడఁగాలువడియెఁ
దక్కిన మృగంబులన్నియు జక్కులగుచు । నదరుగండలు మిలమిలమెదలుచుండ
ఘోరతరమైన మృత్యూపహారభూమి । కరణిఁ జూపట్టె నప్పుడక్కాననంబు. 39
వనమయూర వృత్తము. ఆమిషముఁ జూచి యటకై వనమయూరం
బామహిని వ్రాలుటకు నాకసమునన్ రా
నామిషము చేకొని ధరాధిపవతంస
స్వామి వెసపట్టనొక సాళువముఁ బంపెన్. 40
క. ఆసాళువంబు గనుగొని । గాసముపై యాసమాని కడునుద్దవిడిన్
వేసరక నెమలివఱచిన । నాసాళ్వము వెంటనంటె నతిరోషమునన్. 41
క. రాజన్యుఁడు నావెంబడి । నాజానేయంబు బఱపి హయఖురపుటకో
టీజనిత ధూళిదట్టము । గాఁజేకటి గ్రమ్మఁ దెరవుగానక చిక్కెన్. 42
గీ. కొంతదడవునబయలైన కుంభినీశుఁ । డటమయూరంబు సాళ్వంబునరసియరసి
యెందుఁగానక నివ్వెఱగందికుంది । యిల్లసింగని విధమయ్యె నేమిచెప్ప. 43
సీ. తురగాధిరూఢులు తురగావతీర్ణులై యాడకాడకునిల్చి రలసిసొలసి
పవనవేగముకన్నఁబఱవంగఁజాలిన విలుకాండ్రుదగనొంటి వెనుకబడిరి
పులిగోళ్లుగజదంతములు చూఱగొను వేడ్క వెనుకొనిరారైరి వేటకాండ్రు
హితులైనపరివారమెండఁ దాఁకునఁజాల వడదాఁకి త్రెళ్ళిరి వాఁగుపొంత
వేఁటమఱగినట్టి వెంగళి తేరికి । బలములేల యేమ్యఫలములేల
వేఁటకతనగాదె వెరవెల్లగోల్పోయి । తబిసితిట్టుగుడిచె దశరథుండు. 44
వ. ఆసమయంబునఁ దనసామ్రాజ్ఞి తేజియు నడవలేక చిక్కిన దిగవిడిచి యొంటిని
బాదచారుండై యరుగునెడ ననతిదూరంబున. 45
ఉ. కేలివనాంతరాళ నవకేసరముఖ్యలతాంతసౌరభ

శ్రీలసూరెకిఁ హరించి సరసీవరసీమ సరోజమండలో
త్తాలసుగంధముంగొని కదంబముగూర్చుకవచ్చి మేదినీ
పాలుఁడు హా యనఁగ విసరెఁ బ్రన్ననిగాలి ప్రమోదశాలిమై. 46
క. మరుదంకురములువచ్చిన । తెరవున సంవరణుఁడరిగి దివ్యవధూటీ
నిరుపమతనువల్లీరుచి । సురుచిరమైయున్న తోఁటసొబగుంజూచెన్. 47
సీ. విభ్రమవతులిందు విహరించిరో కాని యావకాంకితమయ్యె నవనియెల్లఁ
బుష్పాపచయకేళిఁ బొద్దుబుచ్చిరొ కాని వనలక్ష్మికొదవెఁ గ్రొన్ననలేమి
హస్తంబులకు రెమ్మలందకుండెనొ కాని మునువేళ్ళనిక్కిన యనువుచోఁచె
కేళిసరసిలోనఁ గ్రీడించిరో కాని కుచకుంకుమంబంటె కొలఁకునీటి
కనుచువనవాటి యాద్యంతమరసివచ్చి । మొగులలోపలిక్రొమ్మించుమొలకలట్లు
తరులతాంతర్హితాంగవిస్ఫురణమెఱయు । దివ్యవనితలఁగాంచెధాత్రీవరుండు.
ఉ. ఆఁకలిదప్పులంబడలినందుకుఁజోషు పిసాళికోయిలల్
కూఁకలొనర్చి డెందమును గుందఁగఁజేయఁగఁ గోరుచుట్టుపై
రోఁకటిపోటుకైవడి మరుండును నేఁచఁదొడంగె నిట్టుము
క్కాఁకలఁజిక్కి యాధరణికాంతుఁడు వారలఁజూచి యాత్మలోన్. 49
సీ. రాచిలుకలో కావు రాచిలుకలైనను బక్షంబులిరువంకఁబ్రిబలకున్నె
పూఁదీఁగెలో కావు పూఁదీఁగెలైనను గమనచాతుర్యంబుగలుగుటెట్లు
క్రొమ్మించులో కావు క్రొమ్మించులైనను నిద్దంపుఁదనుకాంతినిలిచియున్నె
ఫణికన్యలో కారు ఫణికన్యలైనను బదపల్లవచ్ఛాయవదలుటెట్లు
లీమురిపెమీవిలాసంబులీబెడంగు । లీయొఱపులీజిగిబిగియు నెన్నిచూడ
మర్త్యలోకంబుచూడంగ మహిఁకిడిగిన । దేవకన్యలువీరు సందియములేదు. 50
క. సరసఁజెలులెల్లమెలఁగం । దరుణీమణియొఱపు నృపవతంసముగాంచెన్
వరనవరత్నంబులలోఁ । (దరళంబగుహీరకళికతళుకుంబోలెన్). 51
ఉ. వంకరవోనిచంద్రకళ వాసనగల్గినపైఁడిబొమ్మ ము
ప్పంకపసిండితోడ నొఱవచ్చినకస్తురిపిల్లచెల్వుచేఁ
గొంకరవోని కప్పురపుఁగ్రోవి (మదాళిగరున్మగుద్గతిం)
జంకనిపూవుఁగొమ్మయనఁ జంద్రనిభాస్యచెలంగెసన్నిధిన్. 52

క. పలుకుల నమృతము చిలుకన్ । జలజల కెమ్మోవి పలనజక్కెర యొలుకన్
దళతళ మెయిజిగి బెళుకన్ । నెలకొను శృంగారరసము నిలువునఁ గులుకన్. 56

వ. అప్పుడా రాజకుమారుండు వనితామణులకుం దనరూపు చూపిన నదృశ్యత్వంబు
గందు ననుభయంబు నొందియొక తరుస్కంధమూలంబున నొదిగి యిట్లు వితర్కించె.

సీ. తొలుకాఱు మెఱుపులో యెలదీఁగె తఱుపులో తెలివమేయొలవులో తేఁటియరాచ
పవడంపుఁదీవయో చివురాకుఁదీవియో యెలనాగ మోవియో మెఱుఁగరాదు
నఱపుమానికములో యలికిశోరకములో కలికిపెన్నెఱకలో కానరాదు
మరువింటితూపులో మచ్చంపురూపులో తరలాక్షిచూపులో యరయరావు
ఖచరకన్యయొ కిన్నరాంగనయొ కాక । నీచకోరాక్షి నేరీతి నెఱుఁగఁబోలు
కలదె యిటువంటి సొబగు భూకాంతలకును । నేగతిఁ దరింతు సందేహసాగరంబు.

సీ. హరినీలములచాలు నలిజాలములడాలు కడుడీలుపడఁగప్పఁ బడఁతికొప్పు
పగడంబుల మెఱుంగు జిగికెంపుల హొరంగు గెలువం బరగు తీవి చెలువమోవి
యరవిందముల యందముల చందురుని చందమిల క్రిందఁబడ నోము నింతిమోము
నెలవెన్నెలల సంపు బలుచెన్ను గలమించు నిరసించుటకుఁ గ్రొవ్వు నెలఁత నవ్వు
చిలుకపలుకుల నమృతంబు చిలుకుఁ బలుకు । మరలు తలఁపులు మారునికి మరులుకొలుపు
చలివెలుఁగు కళలను మాపు వెలఁదిరూపు । భుగభుగని వాసనల నీనుఁ బొలతి మేను.

గీ. తళుకుఁజూపులఁ జెఱునవ్వు దొలకరింపఁ । దొలుకరి మెఱుంగుఁదీఁగలఁ దొలఁచునట్టి
వనితను వరించినంగదా తనకు నపుడు । సంవరణనామధేయంబు సఫలమగుట. 57

ఉ. సారెకు మానసప్రభవ శైవలజాలము సంగ్రహించి శృం
గారరసంబునం బొలఁచి కమ్మని కస్తురిదావిఁ గట్టి వా
లారు నఖాంకురంబులఁ బ్రియంబున దువ్వియుఁ జల్లిజొంపముల్
గాఁగ చిమ్మింపఁ బోలు రతికాముకుఁడీ యెలనాగ పెన్నెరుల్. 58

క. రాకేందువదన క్రొమ్ముడి । చీఁకటి జొంపంబులయ్యె సిద్ధంబరయన్
గాకున్న వదనచంద్రుని । ఢాకకు వెఱచఱచి వెనక డాఁగఁగ నేలా. 59

సీ. కీరభాషిణి చూపు కేళ్లు వీక్షించినఁ గలువతోరణములు గట్టు నెదుట
నబలవాక్రుచ్చిన నధరబింబంబునఁ జేటతియ్యని జుంటితేనె వడయు
బడఁతి కేలెత్తిన బాహుమూలచ్ఛాయ దీనారటంకాల సొనగురియుఁ

గొమ్మపయ్యెదజాఱఁ గుచకుంభదీధితులను మేరువులును గోటానకోటు
లెట్టియద్భుతమెన్నఁడు నెఱుఁగమెందుఁ । ద్రిభువనీలక్ష్మి యీరీతిఁ దిరుగఁబోలుఁ
గాక యీకొమ్మ నిర్మింపఁగాఁదరంబె । ధాతకైనను మఱి వానితాతకైన. 60

గీ. భాస్వరంబైన మదకోకిలస్వరంబు । పంచమంబని పెద్దలు పల్కువిందు
మీమధురభాషికీ మధ్యసీమకెల్ల । మధ్యమంబౌట యాశ్చర్యమహిమ యెపుడు. 61

సీ. మగువకన్బొమ్మలు మరుఁడు గానకగాక కనినవర్జింపఁడే కమ్మవిల్లు
శుకసాదిసతిమోవి చూడఁడు గాక చూచినఁ జేతఁబట్టునే చిగురువాలు
సతనుండు సుదతినూగారెఱుంగఁడు గాక యెఱిఁగినఁ దేఁటినారేల పూను
నంగజుఁడతివచూపరయఁడు గాకరసినఁ బారవేయఁడే ననములుకులు
విరియనుసరాలు పూవులవిల్లు దేల । పట్టఁబస లేని చిగురాకు బట్టె మేల
యనయము నుటూలుతుమ్మెదగొనయమేల । యంటిననుగందు గ్రొన్ననయమ్ము లేల.

వ. ఇట్లు జగదేకమనోహరంబులైన యీతలోదరిసౌభాగ్యంబులు రాజకీరంబువల
నజ్ఞాతచరంబులైనయాతపతికింబోలె వీక్షింపసామ్యంబులగుచున్నవని వితర్కించి.

సీ. కనుసన్నఁగావించి కలికిరమ్మందునో రాకున్న సిగ్గుచేరట్టుగాదె
నెలఁతడగ్గరనేఁగి నిలిచివీక్షింతునో వడినదృశ్యంబైన వగవుగాదె
యతివనీపేరెవ్వరని విమర్శింతునో మరుమాటయీకున్నఁ బరుసుగాదె
పడఁతికినావిన్నపము చెప్పిచూతునో వినకున్నఁగార్యంబు వెగటుగాదె
యీచకోరాక్షినొనగూర్ప నెవరివశము । పక్షపాతంబుదప్పక పరిధవించి
యకటయాకస్మికంబుగా నతిజవమున । నాటి రాచిల్కవచ్చిన నయము గాదె.

క. బంగారువంటిమేనును । సింగారము దొలుకు మోము జిగియును గలయీ
యంగన సాంగత్యమునకు । గంగాధరుఁడే మహాత్ముఁ గల్పించెనొకో. 65

గీ. ముత్యపుసరాలు కోటులై మొఱవుచూపు । పడఁతికుచదుర్గయుగము చేపడకయున్న
జలధివలయిత భూచక్రశాసనైక । వీరుఁడైనట్టినాకును వెలితిగాదె. 66

చ. ఉరుతరమైన యాసతిపయోధరమండలమందునుండి య
స్ఫురితనిజాంగకుండగుచుఁ బువ్వులవిల్తుఁడు మేఘనాదుఁడై
పరుషవిషానలప్రసవబాణము లేసె నృపాలరాజశే
ఖరునిపయిన్ జగత్ప్రవణకాంతి సముద్యభిరామచంద్రుపైన్. 67

ఉ. సింధుగభీరుఁడయ్యు నృపశేఖరుఁడీగతి నింతిఁజూచి కా
మాంధమనస్కుఁడై పదరి యంగనిగూహముమాని యాతరు
స్కంధతలంబువాసి ఘనజాలవినిర్గత పూర్ణయామినీ
బంధుఁడువోలె నాదివిజభామల డాయఁగవచ్చెనంతటన్. 68

శా. అచ్ఛంబైనసువర్ణదేహరుచితో హాసస్ఫుటాస్యంబుతో
నుచ్చైర్బాహువిలంబితాంశుకముతో నుద్వేలరాగంబుతో
నచ్ఛందంబునవచ్చురాజుఁగని వారాకస్మికంబందుచున్
విచ్ఛిన్నాగ్ర విరాళిమొగ్గ యగుచున్ విచ్చేసిరయ్యంగనల్. 69

క. ఆభువనివిభురూపముఁ । బాయకవీక్షించి తపతిప్రాణసఖులతో
మాయమయిచిలుకచెప్పిన । ప్రాయపురాకొమరుఁడనుచుఁబ్రబలినలజ్జన్. 70

గీ. అచటఁగదలిపోక యాపిశాలేక్షణ । యోగమాయచేతనొదిగియుండెఁ
బూర్వశైలపిహిత శర్వరీసహచర । రేఖవంటిరూపు రేకఁదనరి. 71

క. సిగ్గువడియదృశ్యంబై । యగ్గిరికుచయుండెఁబోక యనురాగాబ్ధిన్
ముగ్గునువేల్పులముంచిన । ప్రెగ్గడయగు మరునిదనుకరింపందరమే. 72

వ. అప్పుడొప్పులకుప్పయగు నప్పల్లవాధరి చూపు దప్ప నుప్పరంబునకెగసి యదృ
శ్యంబైనఁ దెప్పరంబగు నద్భుత విషాదవేదనలంబొక్కుచు నక్కుమారకంఠీర
వుండిట్లనియె. 73

సీ. మరుఁడింద్రజాలిక మహిమగైకొనివచ్చి భ్రమయించి దెచ్చిన పద్మముఖులొ
కొలఁకులోపలనుండి కెలఁకులవిహరింప బయటనిల్చిన నీరుపాఁపలొక్కొ
తరువిలాసంబులు దారొక్కని దర్శింపవచ్చిన దేవతా వనితలొక్కొ
జలధరంబులఁబాసి జగతీతలంబునఁ ద్రిమ్మరు క్రొమ్మించు దీగెలొక్కొ
యిట్టియాకస్మికంబెన్నఁడెఱుఁగముర్వి । నకట మున్నిట్టియట్లనే యణఁగిమణఁగి
యుండకేనిట్లువచ్చితినోరిమలేక । యింకఁదలచూపరొక్కొ యయ్యిందుముఖులు.

ఉ. ఆనగుమోమునాతుకము నాయెదురొత్తుమెఱుంగుఁజన్నదో
యానిడువాలుఁగన్నుఁగవ యానునుజెక్కులు నాపెఱుందుసొం
పానిరుపేద నెన్నడుము నప్పటికిందలపోసిచూచినన్
మానసవృత్తి దానిమిషమాత్రనె నీరయిపోవకుండునే. 75

సీ. కొమ్మయల్లాడినఁ గొమ్మయల్లదెయని తరువనాంతరములఁ దగిలితగిలి
యళులుమ్రోఁగిననైన నళివేణి యదియని యరవిరిజొంపంబులరసియరసి
మిఱుతళుకుఁగన్న మీనాక్షి యనిచేరి కొలఁకుపట్టులజాడనిలచినిలచి
చిలుకపల్కిననైనఁ జిలుకలకొల్కి యల్లదెయని యెల్లచో వెదకివెదకి
నెమకినట్టి యెడనె నెమక నుద్యోగించి । చూచియున్నకడనె చూచిచూచి
కాననాంతరంబుగలయఁ దిమ్మరుచుండె । నావఁ ద్రావినట్లు భూవరుండు. 76

శా. హా రామాతిలకంబ హా మదవతీ హా పూర్ణచంద్రాననా
హా రాజీవదళాక్షి హా కరటికుంభాభోగజృంభత్స్తనీ
హా రంజద్గుణమంజరీ యనుచు హాహాకార శబ్దంబుతో
నారాజన్యుఁడు ధాత్రిపైఁ బొరలు నత్యంతానుతాపంబునన్. 77

క. ఆరీతిన్నృపతివొగులఁగ । నారీతిలకంబునిజమునస్థిరకరుణా
పారీణతఁదలమాపుట । కూరీకృతబుద్ధియగుచు నూహించిమదిన్. 78

సీ. ఇతనిసౌందర్యంబునీక్షించి కదలిపోఁబదములురావెట్లు గదలుదానఁ
దోడిచేడియలెల్లఁ దొలఁగిపోవఁగ నొంటినేనేవిధంబున నిలుచుదాన
నామీఁదితమిఁబొల్చుభూమీశ లేందుగ్రి బాయంగలేనేమి సేయుదాన
నేకాంతముననుండి భూకాంతుతోఁగూడి భాషింపనేరీతిఁబరగుదాన
మానసంబెల్ల డోలాయమానమగుచు। విడువకుఱ్ఱూఁతలూగంగఁదొడఁగెఁజాల
నేవిధంబుననిలుతు ధాత్రీశుమ్రోలఁ । గోర్కెయేరీతి సమకూరుఁగొదువలేక.

చ. ఇతనిగుణాళివైఖరియు నీతనిచారువిలాసవైభవం
బితని సురూపసంపదయు నీతని మోహనదేహమాధురీ
చతురిమఁ జూతురేని నెలజవ్వనమంతయుమీఁదుకట్టిదై
వశలతలే తదీయపదవారిజసేవలు సేయకుండురే. 80

క. ఈరాజును మధురోక్తుల । నూరార్చెదఁగాకయనుచునుత్తరయోగ
ప్రారబ్ధమాయభిడోలని । యారాజుసమీప భూమికతిరభసమునన్. 81

సీ. శింజానమంజీర సింజితధ్వానంబు మట్టెలరవళితో మచ్చరింప
ధగధగత్తాటంక ధాళధళ్యంబులు చెక్కుటద్దములపైఁజిందులాడ
సమవృత్తవక్షోజ చాకచక్యంబులు జిలుఁగుపయ్యెదనుండి వెలికినుఱుక

లజ్జాభరంబును లలితానురాగంబు వీక్షణంబులయందు వియ్యమంద
రత్నభూషణ కాంతులురాయడింప । సమదగంభీరవేదియాసముడలిర్ప
నల్లనల్లననేతెంచె నంబుజాక్షి । ధరణిపతిపాలి సంజీవకరణికరణి 82

క. హరిదశ్వాగ్రస్థితుఁడై । భూరివ్యామోహతిమిర పుంజగతుఁడై
యారమణీస్నేహముసమ । కూరిన సోమకులదీపకుఁడు కళఁజెలఁగెన్. 83

క. తనుజూచినంతమాత్రనె । మునుపటికార్పణ్యమెడలి ముఖపంకేజం
బున దరహాస వికాసము । దనరన్ వీక్షించుపతికిఁ దానిట్లనియెన్. 84

క. ఏమిటికి విలాపించెదు । భూమీస్థలియందుఁబొరలెదవొరలి సరోజ
శ్రీముష్టింధయముగునీ । మోమేటికివాడె భువనమోహనరూపా. 85

చ. అనవుడునోలతాంగి వినుమా నిను మాయపుఁదోఁటలోపలన్
మునుశుకవాక్యపద్ధతుల మోదమునన్ వినునంతనుండియున్
వినుకలికూర్మిఁజిక్కియటవేడుక నీరమణీయరూపమున్
గనుఁగొని నీవదృశ్యమయినన్ మదిఁగుందెద నేమిచెప్పఁగన్. 86

క. ననుగాంధర్వవివాహం । బునఁజేకొని పద్మకోటిఁబురికొల్పెడునీ
కనుసన్నల సకలంబును । గొనకొని గావింపనేలుకొనుము శుభాంగీ. 87

గీ. అనుడుఁదపతిపలికె నర్యుండుమాతండ్రి । యతనియాజ్ఞమీఱ నడఁగాఁడైన
నాకుమఱుఁగుపిండ్లైన నాకేరీతి । నినువరింపనగును నిర్మలాత్మ. 88

క. నినుఁబైకొనుచనుగుబ్బలఁ । దనివారఁగఁగౌఁగిలింపఁదమకించియునే
యనువునను లోకలోచను । కనుమానఁగ లేకయుంటిఁ గాంతామదనా 89

వ. అయిన నాకట్టియుపాయంబు విన్నవించెద నవధరింపు మీవిగ్గిరి గుహాంతరంబు
న నివసించి జపోపవాసాది వ్రతంబుల మదీయ జనకుండైన సూర్యునారాధింపు
మతని యనుమతివడసి యచిరకాలంబున నిన్నువరించెద సుఖంబుండుమని తన క
టాక్షవీక్షణంబుల నారాజునకు నీరాజనంబొనరించి కొంతదూరంబు మఱలిమ
ఱలి చూచుచు నరిగి యంతట నంతర్ధానంబు నొంది సఖీజనులుం దాను నిజ ని
వాసంబునకరిగె నిట సంవరణుండు సూర్యోపాసకుండై యమాత్యకృతశీతలోప
చారంబుల నేదదేరి సచివప్రముఖబలంబులం గరిపురంబునకుఁ బనిచి సూర్యోపా
సనక్రియాసమాహితచిత్తుండై. 90

చ. అట జని కాంచె నాజనవరాగ్రణి యంబరచుంబికూటమున్
జటిలమునీశ్వరప్రకరచారుతపోవనపుణ్యవాటమున్
స్ఫుటతరపద్మకైరవ విశోభిత కేలి సరఃకృపీటమున్
గటుతరదుష్క్రియా దురవగాహ కవాటము రత్నకూటమున్. 91

ఉ. ఆకుధరావతంస శిఖరాగ్రములం బ్రభవించి యాపగా
నీకము వేణిమార్గమున నిర్మలరత్నచయంబు నెప్పుడున్
జేకొని యాత్మభర్తయగు సింధువుఁ గూడఁగ నాటనుండి ర
త్నాకరుఁ డయ్యెఁ గాక మఱియంబుధి కేడవి యిట్టిపేరుముల్. 92

శా. నైలింపాంగనలగ్గిరీంద్రతటబృందంబందుఁ గ్రీడించుమై
హాళిన్ మేఘములెక్కి వచ్చి యట యాతాయాతదంతాహతిన్
డోలాఖేలమునన్ సుఖింపఁగని హృన్మోదంబు సంధిల్లను
య్యాలో జంపములంచుఁ బాడుదురు భిల్లాంభోజపత్రేక్షణల్. 93

గీ. ఆనగంబునందు మౌనిసంఘముతోడ । జనవరుండు పర్ణశాలఁ గట్టి
సేయఁదొడఁగెఁ దపము శీతవాతాతపా । జేయుఁడై వినిస్సహాయుఁడగుచు. 94

ఉ. సింహతలాటలాయ రణజిత్వరసత్వసహస్రకద్వయీ
జింహధనుర్గుణధ్వని విశేషవశంవదదుందుభీభవ
ద్గంహరిగంహరాంతరవిఘట్టితపద్మభవాండదుష్టశీ
లంహరసంహరీ విమతలాలస లాలసగీగజాంకుశా. 95

క. నిర్భీకసంగరోద్భట । దుర్భావితవిమతహరణ దోర్బలహిమవ
ద్గిర్భావకృద్యశశ్శ్రీ । గర్భితగజదండశౌర్యగరిమోద్దండా. 96

సుగంధివృత్తము. భీమసేనబాహుసార భీమసేనవైరిహృ
ద్భీమసంగరాంగణోగ్రభీమతుల్యవిక్రమా
రామణీయకప్రభాభిరామధామసత్కృపా
రామయత్నయప్రభావరాయపక్షిసాళువా. 97

గద్య. ఇది శ్రీమద్గురుకృపావిశేషలబ్ధ సారసారస్వతపవిత్ర విలసద్దంక వీరయామాత్యపుత్ర సరసగుణసాంద్ర గంగాధరకవీంద్ర ప్రణీతంబైన తపతీసంవరణోపాఖ్యానంబను శృంగారకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు

# తపతీసంవరణోపాఖ్యానము.

## పంచమాశ్వాసము.

క. శ్రీరమణాభరణ ఫణిసభ । పారంపర వజ్రఫలకభాసిత భుజాఢ్యా
హారితనుదగ్రమకరా । హీరప్రభికాశ మలికేయిభరామేశా. 1

వ. అవధరింపుము.

సీ. కైవల్యవిద్రుమ ఘనలతాజాలంబు చెలువున[illegible]ంజడల్ జేపురింప
శ్రీసూరమాసమాశ్లేష లగ్నపటీరచూర్ణంబు[illegible]భూతిసొంపు మెఱయ
ముక్తిగేహవితాన మోహనఫలగుచ్ఛలీల రుద్రాక్షమాలికలుదనర
నిర్వాణమయధారుణీధరగైరికచ్ఛాయ నాబ్రహ్మవర్చసము చెలఁగ
నంధకారంబులీను కృష్ణాజినంబు । తనుతనుస్పర్శమిగులఁ బావనము గాఁగఁ
దోడునీడైయరుంధతిఁగూడినడువ । నటవశిష్ఠుండువచ్చె రాజర్షి కడకు. 2

క. వచ్చినముని దంపతులకు । నచ్చుగనర్ఘ్యాదివిధుల నాతిథ్యంబుల్
హెచ్చుగుభక్తినిజేసెల । సచ్చరితుండిట్లు పలికె జాయాపతులన్. 3

గీ. తండ్రిసేమంబె కుశలమేతల్లినీకు । నయ్యభద్రంబెకుశలమేయమ్మనీకు
నిత్యనైమిత్తికాదిక నియమగరిమ । వెలయుచుండునె మీకు నిర్విఘ్నముగను. 4

క. అనవుడునమ్మునిపతియు । ట్లనునోనృపచంద్రనీసమర్థతకతనం
బెనుపొందు జగత్త్రయమున । కనిశముసేమంబు కాకయుఱగాఱగలదే. 5

క. సౌష్ఠవశుభమీతనువతి । నిష్ఠురతపమునకు నోర్చునే భువిమాద్ర
శ్లైష్టీకృత నియమముతో । షష్ఠాంశముకోరునీకుఁ జాలదెచెపుమా. 6

చ. బలువిడిగాఢతంత్రముల ప్రౌఢిమకోర్వక సేతవీక్షణం
బులనదలించి మేనలఁతఁబొందఁగ నంతనిషేధవాక్యముల్

పలుకుచు రాచముద్రికఁ గ్రాలెడు బాళిఁ దలంగరగింప నోపునీ
సలలితయావనంబు వనచంద్రికచందము సేయ నేటికిన్. 7

సీ. నవరత్నఖచితాభి నవరత్నప్రదివ్య భర్మహర్మ్యమె నీకు పర్ణశాల
యతికోమలంబైన యలహంసతూలికా కలితతల్పమె నీకుఁ గటికి నేల
కలమాన్నఘృతమాంసకబళాది సుగ్రాసమా నీకుఁ గందమూలాశనంబు
తుల్యవృత్తస్తనీ దోశ్చామరోద్ధూత మారుతాంకురమె నీకోగుగాలి
రమ్యవస్తుప్రశస్తసామ్రాజ్యభరణ। సౌఖ్యమా నీకు వనవాసముఖ్యవృత్తి
యెలమి మదమదినుండియాయుడుములఁబడఁ। గారణంబెద్ది యెఱిఁగింపు ధారుణీశ.

ఉ. అప్పుడు మౌనివాక్యములకంతయు సంతసమంది స్వార్థముం
జెప్పక తీఱదేమనుచుఁ జెప్పుదు నీతనికంచు రాజు తాఁ
జెప్పెను గొంత సిగ్గువడి చెప్పక చెప్పిన భావమేర్పడం
గప్పిన రాగవృత్తి కడకన్నుల కెంపెఱింగింప నిట్లనన్. 9

క. మునినాథ యోగమార్గం। బునఁ జూచిన మీక గమ్యములు లేవటుగా
వున నాకోర్కులు మీకుం। బునరుక్తులుగావె చెప్పఁ బూనుట యెల్లన్. 10

గీ. అనడు నృపవరేణ్యయా సకలంబు నీ। మనసులోని మమత మాకుఁ దెలిసె
నింతమాత్రమునకు నీతపంబేటికి। గోటనైనపనికి గొడ్డలేల. 11

క. మిత్రితపాటించి మహీ। సుత్రాముఁడవైన నీకు సుతనీకున్నక్
మిత్రాభిధానమవని। బాత్రంబే యెన్నిచూడ భాస్వంతునకున్. 12

ఉ. నెమ్మదిఁ గుందనేమిటికి నెమ్మదినుండుము వత్స యిట్టి కా
ర్యమ్ములు సంఘటించుట మహాగహనంబులె మాకు మాన్సిపూఁ
గొమ్మను దెచ్చి యిచ్చుగతిఁ గోమలయావన మోహనాంగి నిం
గమ్మని పువ్వుఁబోఁడి రవికన్యకఁ దెచ్చెద నీకు నిచ్చెదన్. 13

వ. అని వసిష్ఠుండు-

సీ. నిండుగుండలవంటి నిగ్గుచన్గుబ్బల తపసికన్యక యోతుఁ దారసిల్లెఁ
గందమూలఫలాదిక ద్రవ్యహస్తులై యిరువురు మునిపుత్రు లెదురుపడిరి
సంకల్పితార్థంబు సమకూరునని యుపశ్రుతి పల్కె నొక్క సతోరుహాక్షి
పదినైదు బారలు గదలుచో నొకవంక వలను గాఁ దరువిచ్చె వాఁడు గొల్లి

వలపలికి వచ్చె నటమీఁద వాయసంబు । పయిఁట వలను గఁజను డెంచె బాల యంత
చెంతవల రెక్క చూపెను జెమరుబోతు । మునిపతికి నంతకంతకు ముదము వొదల.

సీ. తనపదాబ్జములపైఁ దరుణినిశ్చలమైన చూపులు తేఁటులై వ్యాపరింపఁ
దనశరీరచ్ఛాయ వనజాక్షి గండదర్పణ మండలంబులఁ బ్రతిఫలింపఁ
దనరోమహర్షణంబునకుంత కుచచూచుకస్పర్శదోహలక్రమము గాఁగఁ
దనపథశ్రాంతికి వనితపాలిండ్లపయ్యెద గాలిపశ్యతోహరుఁడు గాఁగఁ
నమ్మహాముని ముమ్మగంబైనకడిమి । వాయువేగమనోవేగవైఖరులను
గడవజాలెడుగమనవేగంబుతోడ । డాయ నేగెను భానుమండలముకడకు. 15

ఉ. నిద్దపుబ్రహ్మవర్చసపు నిగ్గులు దిక్కులఁ జౌకళింపఁగా
నుద్దవిడి న్దపోధనకులోత్తముఁ డత్తఱిఁ జేరవచ్చు చో
నద్దపుబిల్లకైవడి నిజాలయమండల మొప్పఁ దమ్మిపూ
గద్దియ డగ్గఱ న్నత్తబిసిఁ గాంచి నభోమణి భీతచిత్తుఁడై. 16

క. జాయాసమేతుఁడగుచు । న్మాయాతీతునకుఁ గృతనమస్కారుండై
ఛాయాపతి తత్కృతనిర । పాయాశీర్వచనధన్యుఁడై యిట్లనియెన్. 17

మత్తకోకిల. సేమమే మునినాథ మీకును సీమలోన నవిఘ్నమై
నేమమెంతయుఁ జాఁగివచ్చునె నిచ్చలు న్భవదాగమ
శ్రీమహత్త్వము నన్నుఁ బావనుఁ జేయునో మఱి యాత్మలోఁ
గామితంబొకఁ డెద్ది యేనియుఁ గల్గెనో యెఱిఁగింపవే. 18

క. అనవుడు కుశలస్థితియును । దనవచ్చినకారణంబు తపసి యెఱింగిం
చిననపుడు పేదపెన్నిధిఁ । గనినక్రియం బద్మహితుఁడు గడుముదితుండై. 19

సీ. సిగ్గుజిట్టాడెడు జిఱునవ్వు చెక్కులకెలన వెన్నెలవెల్లిఁ గాలువదాని
ధవళపంకజదళధాళధళ్యముగల వెలఁదిచూపులవల్లె వెలయుదాని
నలవంకబలువంక వలుదగుబ్బలకాంతి మేరుశైలములు నిర్మించుదానిఁ
బ్రత్యంగకంబులబహుళపుష్పకదంబ సౌరభ్యములు వెదచల్లుదానిఁ
దొడవులకు నెల్ల తొడవులగుచు । నిగనిగనిమించు మేనివన్నియలదాని
దపతియనుకన్యఁ దారుణ్యధన్యవపుడు । తపసిచేతికి నిచ్చెఁ బద్మప్రియుండు- 20

వ- మఱియును భౌమంబులైన వస్తుసముదాయంబులు, గజతురంగాది వాహనస

ము దాయంబులు, దదీయవయస్యాజనంబులు నప్పనచేసి యప్పుడుహార్పతి యం
తర్గతబాష్పాకులనేత్రయుగళుండై యిట్లనియె- 21

క- ఉన్నూరువిడిచి పడఁతుక । బొన్నూదికి నియ్యలేకపోగలెడిచో నే
డన్నరలోకంబెకాఁడ । నున్నతసురలోక మేడ యురవందుటకున్. 22

సీ- బాలమిక్కిలిగోల యీపాలపాప । చెక్కుమీటిన పసవల్చు నెలవులందు
గన్నియకుఁజూడ నొప్పక కనినయట్టి । తల్లిదండ్రులసుండగుంధతియుమీరు- 23

క- అనియప్పుడుదంపతులకు । వనితామణినొప్పగించి వగనుడుకుచున
ద్దిననాయకుండుతపనుం । డనుతనయభిధానమున్ యథార్థముచేసెన్- 24

చ- మునియునరుంధతీసతియు మోహనగాత్రిని భానుపుత్రికం
గనకచిరత్నరత్నచయకాంతి కనచ్చతురంతయానమం
దునిచి వసుంధరాస్థలికి నొయ్యనఁబోఁడొకని వచ్చిరచ్చటం
ఘనముగఁబారిజాతమునఁ గాంచనమంజరిఁదెచ్చుకై వడిన్, 25

శా. ఆవృత్తాంతముకౌనకుండను తతీయచ్ఛాత్రుచేతన్వినన్
భావంబందుఁ జెలంగి పూర్ణరజనీనాథోదయోద్వేలపా
రావారప్రతికాశుఁడై తపసిచాయల్మాని ప్రాచీనల
క్ష్మీవన్నైజవిరాజవేషము ధరించెన్ రాజు తేజిష్ణుఁడై. 26

క- తదనంతరమున గరిపురి । నుదితాలంకార వైభవోన్నతమహిమన్
బొదలఁగఁగా సేయుటకై । ముదితలుపుత్తేరమంత్రిముఖ్యులకడకన్- 27

ఉ- ఒక్కొకవాడకన్నమటి యొండొకవాడవిలాసవంతమై
యొక్కొకమేడకన్నమటి యొండొకమేడ విచిత్రవర్ణమై
యొక్కొకయింటికన్నమటి యొండొకయిల్లు వినోదయుక్తమై
యెక్కడఁజూచినన్నగరమింపడరంగయి సేసిరెంతయున్- 28

శా- మిథ్యామధ్యలలంకరింపకయమున్మోలైన పద్మాకరా
పీథ్యాశ్రీగొనివచ్చి మందరమరుద్బృందంబులన్ వీటికై
పథ్యద్విక్రమ మప్రయత్నగతి సంవాసించు నిచ్చాగతిన్
రథ్యాశోధనవారిసేచన సుగంధగ్రంధనప్రౌఢిమన్- 29

క- పుటభేదనమాద్యంతము । నిటువలె శృంగారమహిమ నెసఁగినపిదపన్

బటుబలసంపద మంత్రులు । తటుకున నెదురేగి కనిరి ధరణీపాలున్- ౩౦

శా- వారిన్సాదరదర్శనంబుల ముదావాసంబునొందించియ
న్నారీమన్మథుఁడర్కుఁడిచ్చిన సువర్ణస్యందనంబెక్కి యే
తేరందాపసదంపతుల్ తపత్రితోదీవించి రాసృష్టినిం
బౌరస్త్యానిలు వెంటదెచ్చిన తటిత్పర్జన్యులంబోలుటల్- 31

వ- అప్పుడుభయపార్శ్వంబుల ముందటంబిరుంద రథ కరటి తురగపదాతిసము
దాయంబులు గ్రిక్కిఱిసి నేలయీనిన చందంబున సముద్రంబు వెల్లివిరిసిన పథం
బున సేనాసముద్రంబు చరియింప భేరీమృదంగ శంఖకాహళాది ధ్వానంబులు
భూనభోంతరంబులు బుగులుకొననల్లనల్లనా రాజపుంగవుండుగజపురంబు సొ
త్తెంచెనంత- 32

ఉ- కేళికిఁబూవియోతుర్ణపతి కేలుపెనంగొని రాజదర్శనో
త్వేలకుతూహలంబునను వేగరఁగించిన లీలరాగనీ
లాలకజాలకంబు కుసుమాంజలి చల్లఁగఁజూడనొప్పెన
వ్వేళనరేంద్రుపైఁ గుసుమవృష్టియొనర్చు ప్రమోదమోయనన్- 33

చ- కలికియొకర్తుప్రాణవిభు గన్చిచనుంగవనొక్కి మోవితే
నెలఁజవిఁజొక్కఁజేసి ధరణీవిభుఁజూచి తమింబయింబటాం
చలములమాటుసేయమిఁగుచంబులు మించగవచ్చె నెంతయున్
దొలకనిపూర్ణకుంభములతోఁ బొడచూపఁగవచ్చుకైవడిన్- 34

చ. అవనితలేశు చక్కఁదనమాదరమొప్పఁగఁజూచి ఉషేనికిన్
యువతియొకర్తు తాఁదగుదునో తగనోయని యాత్మరూపమున్
సవరగునొక్కయద్దమునఁ జయ్యనఁజూచి కపోలబింబతుం
డవు నృపుగాంచి సిగ్గుమెయినంతట నివ్వెఱవోయె నెంతయున్. 35

శా. ఉర్వీనాయకుఁడిట్లు పౌరయువతీ వ్యూహంబు వీక్షింపవ
క్పర్వంబైన యపూర్వవిభ్రమమునన్ గన్నట్టు తత్తత్కృపా
శీర్వాదంబుల ధన్యుఁడై పురవరశ్రీఁగాంచు చున్బట్టణాం
తర్వాస్తవ్య మహాగృహంబు పెనుపొందంజొచ్చె సానందుఁడై. 36

గీ. వివిధచిత్రవితాన సౌష్ఠవముమీఱఁ । జెలఁగి వేఱొకనగరికై చేసియుండ

నవవధూమణియు నారుంధతియు మునియుఁ । జనిరి తదధికారనిర్దిష్టసదనమునకు.

సీ. అంతఁ గొంతవడికి నత్తపోధనమూర్తి । మంతుకెక్కినట్టి మంత్రిజనులఁ
బృథివిసురలఁ గూర్చి పెండ్లిలగ్నము నిర్ణ । యింపఁ జేసి పలికె నెల్లి యనుచు 38

క. ఆవేళ రాయభారులు । భూవలయములోని సకలభూనాయకులన్
రావింపఁ బనిచె భూపతి । వైవాహికశుభనిమిత్తవైభవమునకున్. 39

గీ. పుడమిఁగల రాజహంసులు ప్రోవుపడుట గాంచి । సరసులకు మేలుపట్టైన కరిపురమున
కరుగుదెంచిరి పక్షపాతాజవమున । సమధికానందరసవృష్టి సందడింప. 40

క. వచ్చిన నృపవర్గమునకు । వచ్చిన బంధువులకెల్ల వసభవనంబుల్
హెచ్చిన మచ్చిక నిచ్చిరి । లచ్చిని చ్యాశికమలచలదళంబులు పిలువన్ 41

అయ్యవసరంబున

గీ. అవధిసిద్ధుండు భాస్వంతుఁడనెడు బంటు । నస్తశైలంబ నెడు చిప్ప నణఁచిపట్టి
యందు లేదిందు మాపెదన న్నకరణి । నుదయగిరిమీఁదఁ గనుపట్టె నుష్ణకరుఁడు. 42

క. అంగనలెల్లరు నమ్ముని । పుంగవు ననుమతమువడసి పొంగెడు వేడ్కన్
సింగారింపఁ దొడంగిరి । బంగారు సలాకవంటి పడఁతిం దపతిన్. 43

సీ. కరకంకణంబులు ఘల్లుఘల్లన నొర్తు పడఁతికి నంటె సంపంగినూనె
కొరివ్రాఁడినఖముల కురులు దిద్ది యొకర్తు భామకు నిడెను గంధామలకము
జలకమార్చె నొకర్తు జలజాయతాక్షికిఁ జల్లని తేటగొజ్జంగినీటఁ
దడియొత్తె నొకతె కాంతాలలామకు మంచివలిపంపు పట్టుదువ్వలువచేతఁ
గాంత కొసఁగె నొకతె చంద్రకావిచేల । నబ్జగంధికి వేణి యల్లార్చె నొకతె
వెలఁదికొక్కతె తురుమున విరులు దురిమెఁ । దొడవులన్నియుఁ బడఁతికిఁ దొడిగె

క. మృగనేత్ర యొకతె సతికిని । జిగిగల యద్దంబుఁ దెచ్చి చెంగట నిలిపెన్ [నొకతె. 44
మగువ మొగంబునకోడిన । మృగలాంఛనుఁ బట్టి తెచ్చు మేలపు దలిర్పన్. 45

క. కలశంబుఁ గూర్చె యొక్కతె । యలివేణికి నంగరాగమలఁదిన యపుడ
య్యలరుం దేనియఁ దోఁగిన । వలరాయని కుసుమశరము వైఖరి నమరెన్. 46

వ. తదనంతరంబ కరిపురీశుండును చతుర్విధాలంకారమనోహరాకారుండై వధూభవనగమనోన్ముఖుండగుచు మాహూర్తికకృతస్వస్తివచనంబులు గైకొని నిజసదనంబు వెడలి కక్ష్యాంతరంబులు గడచి భూసురాశీర్వాదనాదసమ్మోదమే

దురహ్లాదయారవిందుఁడై మనోవేగంబున మెలంగెడు పుష్పకరథంబు నారోహ
ణంబొనరించి మిత్రబంధుసహపాలవర్గంబులుభయపార్శ్వంబులఁ గొలిచి న
డువ భేరీమృదంగ శంఖకాహళాది ధ్వానంబులు ఘనానభోంతరంబుల వెల్లివిరి
య ఘంటాపథంబున నరుగుదెంచునప్పుడు నైష్ఠికగరిష్ఠుండైన యవ్వసిష్ఠుండు
సకలబంధుసమాజంబుతో నెదుర్కొని రథావతీర్ణుండై యనుంగు పెండ్లికొ
డుకుపురోభాగంబునం జనుచు సమవిషమోన్నతస్థలులు వక్కాణించుచుండ న
ల్లనల్లన మందిరంబు డాయంజనునప్పుడు. 47

సీ. కోమలాయతఘనశ్రీమించు పెందొడల్ కదళికాండములతోఁ గాలుదువ్వ
గురుకుచకుంభముల్ పరిపూర్ణహేమమయోరుకుంభములతో నోరయుచుండ
దరహాసచంద్రికాధవళగండస్థలుల్ ముకురమాలికలతో ముద్దుగులియ
మాధుర్యధుర్యబింబాధరచ్ఛాయలు పవడంపుఁగంబాలఁ బరిహసింప
మూర్తిభవనాది దేవతామూర్తివోలె । సతియరుంధతి బహుపతివ్రతలతోడ
నవ్యకర్పూరనీరాజనంబులొసఁగె । నల్లనల్లన గారాపుటల్లునకును. 48

ఉ. ఆరతిబోటిమైన మునియంగన సంగతిఁ బేరటాండ్రతో
నారతులెయ్యఁగన్గొనినయంత కొకానొకవింత కాంతులన్
జారలుగొన్న నెమ్మొగము సొంపునఁ జేరి వివాహవేదినీ
హారకరుండు రాత్రిగదియందొలిగుబ్బలి జెందువైఖరిన్. 49

క. గణుతింపరాని ముదమున । నణిమాది విభూతివంతుఁడైన వరునకున్
మణిమయపీఠము వెట్టిరి । గుణశీలకులాఢ్యలైన కోకిలవాణుల్. 50

గీ. అట్టిపీఠంబునందున్న యవనిపతిక । నెలఁతబంగారుబిందెతో జలముచిలుక
మునియు నాతని యడుగుఁదమ్ములనుగడిగి । ముదమునను జేసె మధుపర్కముఖ్య [విధులు. 51

క. గౌరీకళ్యాణంబటు । నారీమణు లెల్లఁ బాడ నవపుణ్యాకళా
పారీణుఁడైవసిష్ఠుం । డూరీకృతనియతిధారం వోసెం దపతిన్. 52

వ. ఆసమయంబున దినకరకుమారికను ధారవోసినం బరిగ్రహించి కన్యావలోక
న జన్యానురాగంబున నభ్యంతరసంతాప శాంతిఁ గావింపందలంచియును సిగ్గు
మాటుననున్న యనురక్తి చందంబునఁ దెలిచీరముసుంగుననున్న వధూరత్నంబు
చేరంజని. 52

క. తెలవకు ధరణీపతికిని । తెలయెత్తినదాఁకఁ జోచెఁ దెలలెత్తి మదిన్
తపతీపులేనికూరిమిఁ । బొరిపొరినలుగొఅలులేక పూరించునఁటే. 53

గీ. సన్నవలిపంబులోఁ గగ జంపతులకు । నిర్వికల్పకదృష్టి సంధించెనపుడు
నడుమఁ బూఁదూపులేయు కందర్పునకును । సవ్యసాచియను బిరుదు సంభవించె.

క. వలిపంబాకింత దివిచినఁ । దొలుచూపులఁ గలసె దంపతులకన్వేళన్
వలరాజు రతియు వారలఁ । దెలిచూపున నేసినట్టి తెఱఁగు వహించెన్. 55

క. సుముహూర్తంబని భూసుర । సముదాయం బెచ్చరింప సంవరణుఁడా
రమణీరత్నము డగ్గరి । యమరఁగఁ దలఁబ్రాలు లోసె నధికప్రీతిన్. 56

గీ. అంతఁ జెంతనున్న యంగనామణులెల్ల । వేళవచ్చెననుచు వేగపడుచుఁ
బడుచు కేలుదోయిఁ బ్రాల్పోసి నించిరి । తరుణిశిరసుమీఁద సరసమెసఁగ. 57

క. చేతులఁ బ్రాలు మహోత్సవ । మాతతిఁ గావించి మించి రన్యోన్యంబున్
శాతోదరియును నృపతియుఁ । జేతోగత రాగరసము చిప్పిలుచుండన్. 58

క. అంగుళములు చలియింపఁగ । బొంగుచు సర్వాంగములను బులకలు మొలువన్
శృంగారదాయకుం డాగి । మంగళసూత్రంబుఁ గట్టె మదవతి యుఱఁతన్. 59

క. అంగనయొక్కటై యిరువుర । కొంగులుముడివైవనపుడు గురుసమ్మతమై
గొంగుముడివైచెనప్పుడె । యంగజుఁడాత్మీయకార్యమలవడెనంచున్. 60

వ. తదనంతరంబ సఖీజనంబులన్యోన్య కరాంబుజంబులంగీలింపంజేసినఁ బులకిత
ప్రకోష్ఠులై వధూవరులు శోభన వేదికామధ్య సమధ్యాసీనులై జపహోమా
దివిధులు నివర్తించిరి. ఇవ్విధంబున దినచతుష్టయంబు సాంగంబుగా జరిగినఁ
బరిణయానంతరంబున 61

సీ. బంగారురథములు పదునాలు వేలును నినుమడియైన గంధేభఘటలు
సామ్రాణి తేజీలు షష్టిసహస్రంబులందతాఁ పరిచారికాంగనలును
నవరత్నకీలిత నానావిభూషణ వ్యూహమంజూషికలొక్కలక్ష
చీనిచీనాంబర శ్రేణుల మేల్తరమైన పెట్టియలు కోటానగోట్లు
* గంధకర్పూరకస్తూరికాహిమాంబు । సంకుమదగంధసారప్రశస్తవస్తు
వరసమాజంబు మునివరుండరణముగను । జెండ్లికొడుకునకిచ్చె సంప్రీతితోడ. 62

క. వాచవులుచూపఁ జాలుస । మీచీనఫలంబులేర్చి మేల్దళుకొత్తన్

దాచిత్రసరాయభారవు । రాచిల్కకుఁ గనకపంజరంబున నొసఁగెన్. 63

క. అంతటధారావాహిక । సంతోషము వెల్లివిరియ జగతీకాంతుం
డింతెంచి కొని నిజభవ । నాంతరమునకరిగె మన్మథారాధకుఁడై. 64

సీ. కదళీతోరణమాలికా మంటపాక్లృప్త పటువితానవితాన భాసురంబు
కుసుమదామకసముల్లసిత కాలాగురువరధూప వాసనావాసితంబు
శశికాంతదీపితస్తంభజృంభిత భర్మమయ సాలభంజికామండితంబు
ధగధగద్ధగసముద్ధతకాంత సంతతోద్యద్బహురత్న దీపాంకురంబు
చతురశీతివిధక్రియాచతురవివిధ । బంధబంధుర చిత్రసంభావితంబు
నైన మోహనమందిరాభ్యంతరంబు । తళుకుమీఱిన వైజయంతంబుకరణి. 66

క. ఆలీలాసదనంబున । డోలాంతరమందు నాథుఁడు వసింపఁగన
వ్వేళ నలయించి తెచ్చిరి । బాలికలందఱును హాసపడుచుంబడుచున్. 67

క. ఆకాంతామణియచ్చట । భూకాంతునిఁ జూచి భీతిఁ బొరలెడు మదినా
శీకృతమునకుం బొగలుచు । వాకుద్రివ్వక యుండి నేలవ్రాయుచునుండెన్. 68

క. అయ్యెడనొక్కనెపంబున । నెయ్యపుఁజెలులెల్లఁ జనిన నెలఁతకరాబ్జం
బొయ్యన పతి కబళించినఁ । దొయ్యలి గడగడవణంకె దోరపుభీతిన్. 69

ఉ. పోయెదనంచుఁ జూచుఁ గరముం గబళించినఁ బోవ రామికిం
బ్రాయపుఁజెన్నుకత్తియలఁ బల్మఱు దూఱు మనోవిభుండు దా
రాయిడిఁ బెట్టువోయని పరాఙ్ముఖమందుచు నిట్లు గమ్యల
జ్జాయుతమైన నాఁటి కిలికించితమంచితమయ్యె నీనికిన్. 70

క. అమ్మోహనాంగి దనయుం । కమ్మునఁ జేర్చుకొని విభుఁడు గౌరవమొప్పన్.
ధమ్మిల్లభరము నిమురుచు । ముమ్మరమగు భయము దేర్చి ముద్దులగుమ్మన్. 71

సీ. కుసుమరాగంబు కొప్పునిండెనటంచుఁ గొనగోళ్ళఁ బలుమాఱు కురులు దువ్వి
చెమటబిందువులు వోఁజిమ్ము వ్యాజంబునఁ జిన్నారిపొన్నారి చెక్కునొక్కి
పెనఁగొన్నముత్యాలపేరుల దిద్దెదనని వలుదపాలిండ్లు కైవసముచేసి
మొలనూలిఘంటలు మురువుచూతమటంచుఁ గాంచీపదంబుపై కరము చాచి
యిట్లు చిట్టంటుసేతలనింపురేచి । బాలికామణిమందాక్షభరముకొంత
మాటిమాటికినడఁగిపోమట్టు పఱచెఁ । దనదులావణ్యమెసఁగంగ మనుజవిభుఁడు.

సీ. కబరికాబంధంబు కబళించుఁగబళించి నెమ్మోనికంపంబు నిలువరించి
బింబాధరదళంబు చుంబించుఁజుంబించి ఘనమైనముడి విముక్తంబుచేసి
పాలిండ్లు కౌఁగిటఁగీలించుఁగీలించి డెందంబులో భీతి డిందుపఱచి
తుదినీవిబంధంబువదలించు వదలించి చిట్టాడు సిగ్గువాకట్టుగట్టి
కంతుచట్టమెడసికలఁకలనవ్వించి । వంతులకుఁజెనఁగవలనుచేసి
మగువపెక్కువగలమిగులఁగఁగరగించి । విభుఁడుమదనకేళివివశుఁజేసి. 73

వ. ఇవ్విధంబున నవయౌవనోచిత విషయాభిలాషసమానసుండై యప్పువ్వుబోఁడి
యుం దానును హేమశిశిరవసంతాది ఋతుసమయోచితంబులగు భోగంబులను
భవించుచు మేరుమందరప్రముఖ నిఖిలశిఖరి గుహాముఖంబుల మఱియునుం ద
క్షిణ వివిక్తప్రదేశంబుల విహరించుచు నొకనాడు మలయాచలంబుచేరఁజని
సహధర్మచారిణిఁజూచియిట్లనియె. 74

దండకము. చపలనయన యీచందనాగంబుచందంబులాశ్చర్యకందంబుఁగంటే పుఁజె
ల్లెయిధఃకందరాసీమలన్ వేమరున్ వేమిళద్గంధసంబంధ బంధంబులై యుండనా
దండనుద్దండవేదండరాట్కర్ణ తాళంబులన్ బాలెమైపాఁపఁటేఁబూపతండంబు
పాలిచ్చి పెల్లుగ్గుగాఁ ద్రావనుద్యద్భుజంగంబులేకాహుతిం గ్రోలఁ దద్ఫూత్కరిఫూ
త్కారవాతోద్గమక్ష్వేళ కీలాహతిం గ్రాఁగియోనీదుబింబాధరస్యందిధారామృత
స్పర్శనంబంది శైత్యంబునంబొంది మందానిలాంకూరముల్ గందవుం జేరులై
చందనామందగంధంబులన్ దిక్కులం జెక్కుచందంబులొందం బచారింపఁగాఁ
జూచితే మేచకాంభోరుహాక్షీ మహాక్షీణతాహేతు సూనాదివాస్వాది సంజాత
చేతోముదంబంది పైభూములం గిన్నరీ కిన్నరద్వంద్వముల్ కిన్నరుల్ పూని తార
స్వరం బెత్తి తాళక్రియల్ హత్తి గీతప్రబంధంబులన్ మోహబంధంబుగాఁ బాడు
చోమెచ్చి మమ్నాయనంబోలు గొమ్నాభ్రమేతద్వరంబెచ్చెనో మచ్చకంటీకనుం
గొంటివాగింటివాకన్ మయూరంబుతోరంపుబింబంబు గొంచెంబుగాకుండ సా
రెంబ్రపంచంబుగావించి నీచారుధమ్మిల్లబంధంబుఁదాచూపఱుల్ చూడ్కికిన్ మో
హబంధంబులం గంధసారద్రు సంవేష్టితవ్యాళబంధంబులన్ రేచి యాచేరుపన్ బా
లనాగంబు కంఠంబునా సాగ్రభాగంబునం గుచ్చి యుచ్చైఃపదం బెక్కుచో నక్క
టా చయ్యనన్ బయ్యెదన్మాయఁగా నేల రోమావళీసీమ నాశంక ఛేఁగొంకఁగానే

టికిన్నాటికిన్నీదు ముగ్ధత్వమున్నానవేమందునో మందయానావతంసా రిరంసాభి
లాషమ్ముల న్మనుభూభృద్గుహాగేహా సీమమ్ములందుండి గన్ధర్వుల మ్మోజపత్రేక్షణ
లారున మ్మోదయానాళ్ళపై నెక్కి యేతత్తుకాభృతూకూట కోటీస్వహరింప నస్మ
త్ప్రకారమ్మునన్వచ్చి యున్నారు పున్నాగనాభో మహాభాగులీకొండపై నుండు
భోగుల్జగన్మోహినీ గేహినీలోక చూడామణీ యీమణీ గహ్వరాన్తమ్ములెంతేని
భవ్యమ్ములిచ్చోటనిచ్చావిహారమ్ముల న్సేలిసల్పన్దగున్. 75

సీ. అనుచునివ్విధమున నబ్జాక్షితోఁగూడి నృపతియామలయాచలేంద్రమందు
విజయాభిలాషుఁడై పెక్కువర్షములుండి ధారుణిపాలింపఁదలఁపఁడయ్యె
నదికారణంబుగా నఖిలలోకములకుఁ దొడరెననావృష్టిదోషమంత
నట్లతిబాధచే హాహా స్వనంబుతో భువనసంక్షోభంబుపుట్టె మిగులఁ
బంటలును బాఁడితోడ లేబరములయ్యె। నపుడరుంధతివల్లభుఁడరుగుదెంచి
రాజునకుబుద్ధిచెప్పి సామ్రాజ్యవహన। సహనుఁగాఁజేసి కావించె శాంతివిధులు.

వ. ఇవ్విధమ్మున నమ్మునిప్రయుక్తమార్గమ్మున గ్రమ్మఱ సంవరణమహీపాలుండు గ
జపురమ్మునకరుగుదెంచి యాసముద్రముద్రిత క్షోణీభరమ్ము నిజభుజా పీఠమ్ము
నన్నుదురుకొలిపి రాజ్యపరిపాలనమ్ము సేయుచున్నంత. 77

సీ. నెలమూఁడువానలు వెలితిగాకుండంగఁ గురియును బర్జన్యుఁడరసియరసి
కేదారభూములుకృష్ణవర్ణంబులై నిండారుముకాకులు బండఁదొడఁగె
సేపల్లెజూచిన సేరాళమైయొప్పు బాఁడిచే వ్రేపల్లెవాఁడవోలె
నారామసందోహమభిరామమయ్యుండె నందనవనముకన్నందనర్చి
వర్ణసంకరములులేక వైభవమున। నంతకంతకుఁబొదలె యాగాదివిధులు
నేలఁబాతెపు చీమకు నింగిసురల। కొకకొల్లదినె సంతోషముప్పతిల్లె 78

క. ఈరీతిని ఫలవితతిని। ధారుణి యీనం గనీసునంబలె నృపుదే
వేరియుసుతసంతానా। కారణఫలమీయఁగోరి గర్భముదాల్చెన్. 79

సీ. తనతోడవిహరించు ధవుఁడిలారతుఁడైన మొగమువెల్వెలబాఱె మగువకనఁగ
నదికారణంబుగా నంభోరుహాక్షికిఁ దొడవులపైనాస వెడలెననఁగ
దనకు రానుతుఁడున్న చనువునఁదనుమధ్యమిరుగుపొరుగుకన్న హెచ్చెననఁగ
గాఁదీఁగతనకన్న ఘనతగాంచెనటంచు జనుమొగంబులఁగందు మొనసెననఁగ

నాఁడునాఁటికిఁబ్రియునిసంతసముతోడ । నబలకును వెల్లివిరియంగఁదొడఁగ వెలికి
లక్షితములయ్యెదోహద లక్షణములు । పితృజనుల నర్తనక్రియల్ పెచ్చుపెరుఁగ.

క. నవమాసంబులునిండిన । యువతికి శుభలగ్నమందు నుదయించెఁదనూ
భవుఁడుచ్చస్థశుభగ్రహ । నివహాభివ్యక్త భాగ్యనిలయుండగుచున్. 81

క. దినదినపర్యాయంబునఁ । దనయునకును యౌవనంబుదార్కొనుచుండన్
ఘనమైనరాజ్యభారము । పనుపడయువరాజ్యపట్టభద్రునిఁజేసెన్. 82

సీ. ఇరువేయునిన్నూట యిరువదిరెండేసి యోజనంబులమేరయుద్దవిడిని
నిమిషార్ధమునఁబోవు కమలబాంధవుతేరు మునుమున్నుచని భానువినుతిఁజేసి
నతనికిఁ గన్యాజనావతంసంబైన తపతినిఁగొనుచుఁ దాత్పర్యమెసఁగ
ధరణికినేతెంచి పరిణయంబొనరించె సంవరణక్ష్మాజానికతివ
యదియుఁగాక యనావృష్టియనెడిదోష । మతనిలోకంబునకుఁబాపెనధికమహిమఁ
దపసిమాత్రుండెబ్రహ్మర్షిధన్యతముఁడు । చిరతపశ్శ్రీరాజధాని వశిష్ఠమౌని. 83

వ. అని యివ్విధంబుననంగారపర్ణుండు ఫల్గునునకు సవిస్తరంబుగాఁజెప్పిన. 84

క. ఈతపతీసంవరణం । బాతతమతిఁజదువ వినఁజిరాయురుపేత
శ్రీతేజోబలసంప । త్ఖ్యాతులునైయుందురెల్లకాలము మనుజుల్. 85

శా. పారావారగభీరభీర హితరూపాభీలవీరాహవా.
శూరమ్మన్యవిరోధియోధ రమణీశుంభన్ముఖాంభోరుహ
శ్రీరమ్యోదయపశ్యతోహర మహాస్వీతైకవీరప్రసూ
ధారప్రాప్తకృపాణవల్లికలనాస్థానీ భుజామండలా. 86

క. తారాచలహారామల । తారానీహార హారధవళసుకీర్తీ
సారస్వతసారస్యవి । చారస్తుతమతికవీంద్ర సన్నుతమూర్తీ. 87

ఉత్సాహ. తృణకణాయితస్వకీయదృప్తదుష్టవిద్విష
ద్గణనిబద్ధధగధగద్ధగత్ప్రతాపవారకా
బెణదకోట ఘనకవాటపీఠపాటనక్రియా
చణఘణంధణాని నాద జయరమామిలాంచనా. 88

గద్య. ఇది శ్రీమద్గురుకృపావిశేషలబ్ధ సారసారస్వతపవిత్ర విలసదద్దంకి
వీరయామాత్యపుత్ర సరసగుణసాంద్ర గంగాధరకవీంద్ర
ప్రణీతంబైన తపతీసంవరణోపాఖ్యానంబను
శృంగారకావ్యంబునందు సర్వంబును
బంచమాశ్వాసము.

---

సంపూర్ణము.

# తపతీ సంవరణోపాఖ్యానము-
## శుద్ధపత్రిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | |
|---|---|---|---|
| 1 | 11 | మలికిభురాము | మలి-భరాము |
| 2 | 13 | డెగలుఁగుఁ గళుల | దొలఁగుకవల |
| 2 | 24 | మలికిభూరాము | మలికిభరాము |
| 4 | 18 | బరినోకి | బరిదోడి |
| 4 | 19 | చతురనీతి | చతురశీలి |
| 4 | 20 | వాహసురాధి | వాహశిఖరాధి |
| 9 | 17 | వినో । దంబులనైక | వినో ? దంబునఁజెక్కు |
| 9 | 24 | పిలుతుగర్ధి | పిలుతుగర్వి |
| 11 | 20 | శోణతటినిండగ | శోణతటినిండగ |
| 13 | 24 | సంచత్సుర | సంచరత్సుర |
| 14 | 16 | గెంబెడలట్ల | గెంజడలట్ల |
| 21-25 | 6-11 | ఉత్సాహ | తరల |
| 27 | 19 | సీవం । టనమవగు | సినం । టనువగు వరునికినిచ్చిన |
| 65 | 13 | తతీయ | తవీయ |
| 69 | 26 | జె ట్లి | జెంట్లి |
| 72 | 21 | ముప్పతిల్లె | ముప్పతిల్లె. |